

అనుబంధాలులో కొత్తనటి నాగరత్నం



ఒకే ప్యాకెట్టుకు
చాలాకప్పుల
కాఫీ
Pure, Refreshing & Healthful
ఆంధ్రా కాఫీ పౌడర్
ANDHRA Coffee
రెడ్ లేబుల్ కాఫీ
An Ideal Beverage For The Whole Family
చిక్క,నిడికార్లను,ఖర్చుకు మంచి ప్రతిఫలము.......

# ఉత్తరాలు

## ముఖచిత్రం

ప్రసిద్ధ హిందీ తార మీనాకుమారి చిత్రం చాలా బాగున్నది ఈ వారం ఈ సంచిక మిక్కిలిగా ఆకర్షించుటకు— "నూతన శీర్షిక తారల కొలువు లోని కుమారి నిప్పాణి జమునయు, కవరు పేజీలో చిలిపి కనుల చిన్నారి కృష్ణకుమారి చిత్రము నన్ను ఆనంద పరుచుటయేగాక — ఆంధ్రుల అభినందనలను పొందుటకు సన్నిహితమైనవి," గాన ఈ సంచిక మా చేతినుండి ఏ మాత్రము దిగుటకు సందేహించుచున్నది.

సి ఆర్ మురళీ మోహన్ (తాడేపల్లిగూడెం)

* * *

ఇంతవరకు వేదాంతం ఒక్కటే అర్థం కాని విషయం అనుకున్నాను. కాని చిత్రలేఖనం కూడా ఆ జాబితా లోనే చేరుతుంది — అనిపించింది మీ బహుమతి పొందిన ముఖచిత్రం చూసాక!

చంద్ర (కాకినాడ)

* * *

ముఖచిత్రంగా ఎప్పుడూ సినిమా తారల ఫోటోలను ప్రచురించటంకన్న, మంచి చిత్రాలను ప్రదర్శించి, చిత్రకారులకు ప్రోత్సాహం ఇమ్మని ప్రార్థన ఈ విషయం గమనించి, ఇకమీదట చిత్రాలను ప్రచురించుతారని ఆశిస్తున్నాను.

కె. పద్మ (అమలాపురం)

## రాజధాని కబుర్లు

ప్రస్తుతం హైదరాబాదులో అద్దె ఇండ్లను గురించి వ్రాసిన వ్యాసము చాల సమయోచితముగాను, సహజంగాను ఉన్నది స్టూడెంట్సుకు మరీ కష్టముగా ఉన్నది. భోజనము సక్రమముగా ఉన్న హాస్టల్స్‌లో సీటులు లేకపోవటము, సీటులు ఖాళీగా ఉన్న హాస్టల్స్‌లో భోజనము సరిగా లేక పోవటమూనూ పోని బయట రూమ్‌లో ఉండి 'కేరియర్ తెప్పించుకుందామంటే 40 రూ కు కూడ రూమ్ దొరకదాయె. ఎక్కడన్నా ఖాళీ ఉన్నా స్టూడెంట్సంటే ఇవ్వమంటున్నారు తాడు తెగిన గాలిపటాల్లా ఉన్న మా పరిస్థితి ఇక వేరే చెప్పనక్కర్లేదనుకుంటా! రచయితకి నా మనఃపూర్వ నమస్కారాలు.

కె ఆర్. బి. (మెడిసన్) (హైదరాబాద్)

## కథలు

బ్రదర్ 'తంబు'గారు మీ గాథ వినిన దగ్గర నుండి నాలో బాధ ప్రారంభం అయింది. పెళ్లి కావాలనే బ్రహ్మచారులకు మంచి సలహా ఫీజు లేకుండా ఇచ్చినందుకు నా ధన్యవాదాలు. ఇక మీదట పెళ్లి సంగతి ఎత్తను బాబోయ్!

బ్రహ్మచారి సోదరుడు జెట్టి సింహాద్రిరావు, (యలమంచిలి)

* * *

మీరు ప్రచురించిన "ఘటన" చాలా బాగా ఉన్నది. రచయితగారికే నా అభివందనములు.

పాపులూరి రమణారావు (వెల్లటూరు)

* * *

"పెళ్లొద్దు బాబోయ్" కథ చాలా బాగుంది మొదట పెళ్లి చేసుకోవాలని పట్టు పట్టి పెళ్లి చేసుకొన్నాను. తర్వాత "తంబు"గారు వ్రాసిన మాటలు పొల్లు పోకుండ అడపా దడపా జరుగుతూనే ఉన్నాయి.

వై. బాలస్వామి గుప్త (మదునాపురం)

* * *

క్రిందటివారం 'మాటర్ హర్న్ లోయల్లో హత్య' బాగుంది. ఇన్ని వారాలనుండి ప్రచురిస్తున్న 'నా అనుభవాల్లో కెల్ల పెద్ద పరిశోధన' వ్యాసాల్లో క్రిందటి వారందే నాకు నచ్చింది.

బాచి (సిర్పూర్— కాఘజ్ నగర్)

* * *

రామలక్ష్మిగారు వ్రాసిన "తప్పి బ్రతికిపోవ తరమా" అను కథ అత్యుత్తమంగా, బ్రహ్మచారులకు ప్రభోధాత్మకంగా ఉంది ఈ కథ చదివిన తరువాత పెళ్లి చేసుకోనివారు ఎందుకు పెళ్లి చేసుకోవాలో, చేసుకొన్నవారు ఎందుకు చేసుకొన్నారో తెలుసుకొనడానికి అవకాశం కలిగింది.

అనూరాధ (బిలాస్‌పూర్)

## న్యూఢిల్లీ లేఖ

ఇటీవల జరిగిన ఉప ఎన్నికల గురించి శ్రీ కృష్ణగారు వ్రాసిన వ్యాసంలోని కొన్ని విషయాలతో నేను ఏకీభవిస్తున్నాను. ఈ అపజయాలకు సంబంధించిన విషయం ఒకటి గమనించాలి. అవి తటస్థ విధానాన్నిగాని, శ్రీ నెహ్రూ చైనా విధానానికిగాని వ్యతిరేకమైన తీర్పులు గావు" అన్న శ్రీ కృష్ణగారి అభిప్రాయ మెంతయు సమంజసము తటస్థ విధానానికి వ్యతిరేకమయిన ఏ పార్టీ అయినా సరే, భారతదేశ పరిపాలనాధికారాన్ని చేపట్టట మనేది ఎన్నటికీ జరుగని పని.

కాని, "ప్రధాన మంత్రిని విమర్శించటం నాకు చాలా బాధ కలిగిస్తున్నది" అన్న శ్రీ కృష్ణగారి అభిప్రాయంతో నేను ఏకీభవించలేకున్నాను ఎందుకంటే కాంగ్రెసువంటి ఏకైక విస్తృత సంస్థకు నాయకులుగా నున్న ప్రధాన మంత్రిగారే ఉప ఎన్నికల వంటి ముఖ్యమైన విషయాలలో చీమ కుట్టినంత చింతైనా లేకుండా ఈ క్లిష్ట పరిస్థితులలో వ్యవహరించటం సమంజసంగా తోచదు పార్టీ గౌరవానికి సంబంధించిన విషయాల్లో వారు, కాంగ్రెసువారే అయినప్పటికి యితరుల మాటలను నమ్మటం కాకుండా స్వయంగా పరిశీలిస్తే బాగుంటుంది

తారానాం (నెల్లూరు)

* * *

12—7—63 వారపత్రికలో కేంద్రమంత్రి వర్గంలో మార్పుల అవకాశం మీద శ్రీ కృష్ణగారు వ్రాస్తూ ఒరిస్సా ముఖ్యమంత్రి శ్రీ పట్నాయకుగారు, కాశ్మీరుకు పరిగెత్తుకుంటూ వెళ్లారు అన్నారు. శ్రీ కృష్ణగారు నిజాన్ని, గుర్తించక పోయారని రాయవలసి వస్తున్నది కారణం మా ముఖ్యమంత్రికి ఇంతకు మునుపే కేంద్ర ప్రభుత్వంలో చేరేందుకు ఆహ్వానం రావటం దాన్ని తిరస్కరించటం కూడా జరిగింది ఇక పోగా మా ముఖ్యమంత్రి ప్రధానితో తరుచు కల్సుకోవటం, ఏమీ కొత్త విషయం కాదు ! దానికి పెడర్థాన్ని తీస్తూ ఇలా వ్రాయటం నన్ను కించ పరిచింది

రమణరావు పట్నాయకు (హింజిలికాట)

## రచయితలకు మనవి

ఆంధ్ర సచిత్ర వార పత్రికకు తమ రచనలు పంపేవారు ఈ క్రింది నిబంధనలు గమనించాలి

**కథలు, వనితాలోకం వ్యాసాలు, గేయాలు, కార్టూన్‌లు:**

● ప్రచురణకు స్వీకరించబడని రచనలు త్రిప్పి పంపగోరే వారు వ్రాతప్రతితో బాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన స్వంత చిరునామా కల కవరు పంపాలి.

● ప్రచురించబడని రచనల విషయమై ఏ విధమైన ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు

● త్రిప్పి పంపబడే రచనల వ్రాత ప్రతులు సాధారణమయిన బుక్‌పోస్టు ద్వారా మాత్రమే పంపగలము కాబట్టి రచయితలు దీనికి సరిపడే తపాలా బిళ్లలు మాత్రం పంపితే చాలు. తపాలా బిళ్లలు వ్రాత ప్రతి బరువుకి సరిపోయేట్లు ఉండాలి

● వ్రాతలు సక్రమంగా రచయితలకు త్రిప్పి పంపే ప్రయత్నాలు అన్నీ చేస్తాము కాని వాటి విషయమై ఏ విధమైన బాధ్యతనీ వహించ లేము

● రచనలతో బాటుగా కాక వేరుగా పోస్టేజీ పంపినా వ్రాతప్రతులు త్రిప్పి పంపబడవు

**కథకాని కథలు, ఉత్తరాలు, వనితావాణి :**

● ఏ సందర్భంలోనూ పై శీర్షికకు సంబంధించిన వ్రాతప్రతులు త్రిప్పి పంపబడవు

**నవలలు :**

● ప్రచురణకు స్వీకరించని నవలల వ్రాత ప్రతులు పోస్టేజి జతపరచకపోయినా వాటికి త్రిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని రిజిస్టర్డ్ పోస్టులో త్రిప్పిపంప గోరేవారు రిజిస్ట్రేషన్ ఛార్జికి కావలసిన సరిపడ మొత్తం (65 నయాపైసలు) వ్రాతప్రతిలోబాటే తపాలాబిళ్లల రూపంలో పంపాలి

● వ్రాతప్రతులు సక్రమంగా త్రిప్పి పంపే ప్రయత్నాలు అన్నీ చేస్తాము కాని ఆ విషయమై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. అంతేకాక ప్రతుల విషయమై ఏవిధమయిన బాధ్యతనీ వహించలేము.

**మరొక మనవి :**

రచయితలు వ్రాతప్రతి మీదనే తమ పేరు, పూర్తి చిరునామా స్పష్టంగా వ్రాయాలి లేనట్లయితే ప్రతిఫలం పంపటం కష్టం అవుతుంది

సం॥

ఆంధ్రసచిత్రవార

# పత్రిక

వ్యవస్థాపకులు .
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 26—7—63
శోభకృన్నామ సం॥ శ్రావణ మాసం॥ శుద్ధ॥ షష్ఠి
సంపుటము · 55 సంచిక : 47
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా . రూ. 13.00 ఇతర దేశాల. : ఓడమీద (Sea Mail) రు. 20.00 (విమానం ద్వార (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా 135.00.)

*

విడి ప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1





జమున (ఫొటో: ఎస్. ఎస్. రాధాకృష్ణన్)

## మనలోమాట

గత సంచిక 22వ పేజీలో పడిన 'పాతకథ' రచయిత్రి పేరు శ్రీమతి పూర్ణానంద్ అని గమనించ ప్రార్థన. రచనలు పంపేవారు, పేరూ, చిరునామా స్పష్టంగా, వ్రాతపతి మీదనే వ్రాయక పోవడం వల్ల మాకు చాలా యిబ్బందికలుగుతున్నది! ఈ సందర్భంలో రచయితలకు సంబంధించిన ప్రకటన ఒకటి వేరే చోట (ఇదే సంచికలో) ప్రచురించాము. మాకు రచనలు పంపే వారందరూ ఇది గమనించి మాతో సహకరించ గోరుతాము.

* * *

పోయినవారం అట్టమీద వేసిన శ్రీమతి సావిత్రి బొమ్మను తీసినవారు శ్రీ ఎస్. ఎస్ రాధాకృష్ణన్. ఈవారం శ్రీ జగ్గయ్య ఫొటోలు శ్రీ ప్రభాకర్ తీశారు.

* * *

'మగవారు వంట చెయ్యడం' మీద మాకు వచ్చే కార్టూన్‌లకి అంతులేదు. ఈ చిత్రకారులలో ఎక్కువ మంది పురుషులే! స్త్రీ (చిత్రకారిణులు)లు ఏ విధంగా సమాధానాలు ఇస్తారో ఊహించలేకుండా ఉన్నాము. కాని అటువంటి 'జవాబు కార్టూన్‌లు' వేసి పంపితే ప్రచురించాలనే ఉంది...

* * *

'చదువుల్రావు' యీ మధ్య రెండు సంచికలుగా, అజ్ఞాతవాసంలో ఉన్నట్లుతోస్తోంది కాని అతని అభిమానులు అందరూ (?) 42వ పేజీలో యీసారి అతనిని చూడగలుగుతారు!

## లోకంపోకడ



నిర్బంధ పొదుపు పథకంలో కట్టాలని అడ్వాన్సు అడిగావు? బాగానేవుందిగాని ఆలోటు పూడ్చాలని మళ్లీ అడ్వాన్సు అడుగుతావేమో ?

## విషయానుక్రమణిక


కథలు :

తొలగిన స్వర్గం — 18
పాలపొంగు — 22

సీరియల్ కథలు :

ప్రేమకు పగ్గాలు — 12
కొలంబా — 20

శీర్షికలు, వ్యాసాలు, సినిమా:

ఉత్తరాలు — 3, ఉమెన్ కార్టూన్—6, ఢిల్లీలేఖ — 7, సరాగమాల—8 అపీ యావి అన్నీ—9, మనమూ-మనదేహస్థితీ — 10, రాజధాని కబుర్లు — 11, వనితాలోకం (వ్యాసం)—15, వనితావాణి: వంటలు—17 వివిధప్రాంతాల వింతలు (16) — 21, వారఫలాలు-24, కథకాని కథలు — 27, తెరమీద — తెరవెనుక — 28, మరువలేని మనిషి — 55, సినిమా సమీక్ష — 56.



నీ వోటు నాకే
ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గీయులు
ఆంధ్ర కాంగ్రెస్ వామ పక్షం




గ్రహణం పట్టిందా?
కడుపులో తిప్పుతోందా? పాపం!
భేదిమందు వేసుకోండి
అంతా బాగౌతుంది
బరిసాల కాంగ్రెస్
ఆంధ్ర కాంగ్రెస్




OOMMEN


26—7—58

# కనీసమైన అవసరాలు సైతం లేని ఢిల్లీ నగరం!

## శ్రీకృష్ణ

ఇప్పుడు న్యూఢిల్లీ నగరమంతా చింతాక్రాంతంగా ఉంది. కారణమేమంటే ఇక్కడ వర్షాలు లేవు శాస్త్రజ్ఞులేమో ఇదిగో ఇవ్వాళో, రేపో వాన కురుస్తుందని జోస్యాలు చెప్తున్నారు వీటన్నిటికి తోడు నగరంలో నీటి కొరత ఇంకో పీడ గత నాలుగైదు వారాలుగా ఈ నగరంలో మొదటి అంతస్తు భవనాల్లోని నీటిచుక్కైనా రావటం లేదం టే అతిశయోక్తి కాదేమో! పోనీ క్రింది భాగాలవాళ్ళేమన్నా సుఖపడుతున్నారాఅంటే అదీ లేదు. వాళ్ళ 'ఫ్లష్ అవుట్' టక్కుల తొట్లకు నీళ్ళు రావటంలేదు. అంతెందుకు సఫ్దర్‌జంగ్ ఆస్పత్రిలో రోగులకు పరిశుభ్రం చేసేందుకు నీళ్ళు లేవు. ముక్కులు పగిలి పోతున్నాయి!

ఇవన్నీ ఇంత అరాచకంగా ఎందుకు ఉంచుతున్నారూ! అని పలువురు ప్రశ్నిస్తున్నారు! ఉంచక చెయ్యగలిగింది మాత్రం ఏమిటిటా! దీన్నిగూర్చి పెద్ద పెద్ద అక్షరాల్లో వ్యాసాలుగా న్యూఢిల్లీ పత్రికలన్నీ ప్రకటించాయి సంపాదకు లేఖల పేరుతో ప్రచురించే ఉత్తరాలు దత్తర్లై పోతున్నాయి అయినా ఆ అధికార్లనబడే వాళ్ళకు చీమ కుట్టినట్టైనా లేదు పైగా ఈ పీడ తప్పించుకునేందుకని ఏహో సభలు, ఇంగ్లీష్ వ్యతిరేకోద్యమాల్లాంటి వాటి వైపు ప్రజల మనస్సులు మళ్లింపజేస్తున్నారు

కాంగ్రెస్ పదహారేళ్ళుగా అధికారంలోవున్నా, ప్రణాళికా సంఘం హీనపక్షం పదమూడేళ్ళుగా వుంటున్నా, ఈనాటికీ ఢిల్లీ మంచినీటి సమస్య కనీస అవసరాల వరకయినా సాధించలేకపోయారంటే ఇక పూర్తి పరిష్కారం గురించి ఏదన్నా చెప్పటం సిగ్గుచేటుగా వుంటుంది.

ఇందులో రెండు రకాలైన ఇబ్బందులున్నాయి జమునా నది నుంచి నీటిని సరఫరా చేసే విషయంలో ఢిల్లీ నగరం అటు ఉత్తరప్రదేశ్‌కు ఇటు పంజాబ్‌కు మధ్యగా ఇరుక్కుని ఉంది పంజాబ్ ప్రభుత్వమే తన జనాభాని చిన్నగా ఢిల్లీ నగరం లోకి నెట్టోంది అందువల్ల ఢిల్లీ ఒక విధంగా పంజాబీ నగరంగానే కన్పిస్తుంది ఇలా ఉన్నా పంజాబ్ ప్రభుత్వం ఢిల్లీ నీటి కొరతను గూర్చి రవ్వంత సానుభూతైనా చూపించిన పాపాన పోలేదు ఇటు ఢిల్లీ కూడా ఇక్కడ ఢిల్లీ అంటే భారత ప్రభుత్వం అన్నమాట తన ప్రాతినిధ్యాన్ని నిరూపించుకోలేదు ఈ ఢిల్లీ నీటి సరఫరాలో కూడా ఒక పథకం అంటూ ఏర్పడనేలేదు దీని ఖర్మ ఇలా కాలాల్సిందే ఎవరూ ఏం చెయ్యలేరు మహా మేధావులకు కూడా అంతుబట్టని సమస్య ఐంది కారణమేమంటే ప్రతి నెల కనీసం ఓ 10,000 మంది ఢిల్లీ నగరానికి వచ్చి కృష్ణ కాలనీలల్లా ఆక్రమించి ఓ సాకో, ఇంకో వేసుక్కొంటూరు. వీటినే ముద్దుగా 'జగ్గీ' అంటున్నారు. ఏదన్నా ఓ ప్రత్యామ్నాయవు వసతి ఏర్పాటు చేస్తేనే తప్ప వీళ్లను కదిలించేందుకు వీలు లేదు 'జగ్గీ' దారులు పెద్ద పెద్ద భవనాలు నిర్మించుకుని వేరే విధానమే గాక పరిహారం పుచ్చుకొని కూడా కదలని సందర్భాలెన్నో ఉన్నాయి అంటే ఓ విధంగా ప్రభుత్వం న్యాయంగా పన్ను చెల్లించే ప్రజలకు శిక్ష వేస్తున్నదన్నమాట

ఇది ఇలా ఉండుగ్గా నీటి సరఫరా రోజు రోజుకీ కష్టమై పోతున్నది. ముందర ఈ చిక్కునుంచి బయట పడాలి. అందువల్ల పథకాలు వేసేవారు తమ గతానుభవాన్ని పురస్కరించుకునో, రిజిస్ట్రార్ జనరల్ సాయంతోనో 1971 నాటికి జనాభా ఎంత ఉంటుందో అంచనావేసి ఆ ప్రకారం పథకం సిద్ధపరచుకోవాలి

ఇక్కడ ఈ సమస్యను గూర్చి ఏవేవో ఆలోచనలు ఎక్కువవుతున్నాయి. దాని కారణమేమంటే ఇప్పటి విధాన నిర్ణేతలు, లోగడ న్యూఢిల్లీ నగరాన్ని నిర్మించిన వారి సలహాలను పాటించే అభిప్రాయంలో లేకపోవటమే. ఈ నగరాన్ని నిర్మించింది కేంద్ర పి. డబ్ల్యు. డి. ఛీఫ్ ఇంజనీర్లుగా పనిచేసిన శ్రీయుతులు మధుక్, పూరి లాంటివాళ్లు. వాళ్లకు ఈ నగరంలోని కష్టసుఖాలన్నీ తెలుసు. స్వర్గీయ డా. అంబేద్కర్ మంత్రిగా వున్న రోజుల్లో యమునా నదికి పాతకోట దగ్గర బారేజ్ నిర్మించే పథకం తయారైందని మన ప్రభుత్వానికి చెప్పే వుంటారు. ఈ పద్ధతివల్ల రాజఘాట్ దగ్గర పవర్ స్టేషన్లకు నీరు సరఫరా చేస్తూ నగరంలో నీటిసరఫరా సమస్యను పరిష్కరించటమే గాక ఒక కృత్రిమ సరస్సుగా కూడా రూపొందేది. రోడ్డు,

—49 వ పేజీ చూడండి



భారతదేశంలో 60 రోజుల పర్యటనకుగాను అమెరికా, యూరపులనుంచి వచ్చిన 34 మంది మహిళలు 24 మంది పురుషులు జులై 12 న ఢిల్లీలో రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్‌ను కలుసుకున్నారు. వీరు అజంతా, ఎల్లోరా, ఖజురహో, తాజ్‌మహల్ మొదలగు ప్రాంతాలు దర్శిస్తారు



# సరాగమాల

## వి ఎ కె రంగారావు

### సరాగమాల సమాధానాలు

మద్రాసు నుంచి అ దుర్గాప్రసాద్‌గారు భానుమతి కంఠాన, పెండ్యాల స్వరాన వెలువడిన శ్రీ మల్లాదివారి కవనామృత ధార "సన్నజాజి తీవ లోయ్ సంపెంగ పూవు లోయ్" పరిచయం చేయమన్నారు అంతకన్న ఆనంద దాయకమైన పనేమి ఉన్నది? తప్పక చేస్తాను

చిలకలూరి పేట చలపతిరావు గారికి 'గుండమ్మ కథలో' ఎల్విజయలక్ష్మి నాట్యం చేసిన నృత్య సంగీతానికి ఒక పేరంటూ పెట్టలేదుగాని టైటిల్ మ్యూజిక్ అంటూ రికార్డుగా విడుదల చేశారు దీనికి మాతృక ప్రసిద్ధ కళాకారుడు బిస్మిల్లాఖాన్ షహనాయిపై వినిపించిన ఒక సరళి

" 'అనురాగం'తో టి గోపాలం, కె జమునా రాణి రెండు యుగళ గీతాలు పాడారు విన్నారనే తలుస్తాను దయచేసి ఆ పాటలను సమీక్షిస్తారా" అని గుంటూరు భవానీ ప్రసాద్‌గారు వ్రాశారు పెండ్యాల తమ ప్రతిభను చూపటానికి ప్రత్యేకంగా ఈ కంఠాల కలయికను కూర్చినప్పుడు పరిచయం చేయకుండ యెందుకు ఉపేక్షిస్తాను! రికార్డు ఈ నెలాఖరునకు వస్తుంది అంతవరకు ఓపిక పట్టండి అన్నట్టు యేదో జరిగిన అర్జెల్లకు యేవో మొరిగినవన్న రీతిగా 'శ్రీ కృష్ణార్జున యుద్ధం'లో గోపాలం స్వర్ణలత పాడిన బ్రహ్మాండమైన కామెడీపాట "అంచెలంచెలు" విడుదలైనది విన్నారా?

కొన్ని వారాల క్రిందట సరాగమాలలో ప్రచురితమైన నా విశాఖజిల్లా పర్యటన గురించి అయిదారు ఉత్తరాలు వచ్చినవి అందులో నాలుగు "ఈ సరాగమాల యొక్క ఆశయం గురించి, వాటి రికార్డు గురించి, లేక ఆ గాయనీ గాయకుల గురించి వ్రాయడం కాని మీరు మీ స్వంత మజిలీల గురించి వ్రాయడం చాలా శోచనీయం కాగా లోగడ స్తుతా భావంచేత కొన్ని కొన్నింటికి మీరు జవాబులు ఇవ్వడం కుదరదు అన్నారు కాని మీరు ఈ మీ మజిలీ గురించి వ్రాయడం యెవరికీ సంతోషాన్ని ఇచ్చేది కాదు. కనుక ఇల్లాంటి మజిలీ శీర్షికలు తీసివేసి మంచి మంచి రికార్డులు పరిచయం చేస్తే చాలా సంతోషిస్తాను." వి. భాస్కరరావు తాడేపల్లిగూడెం.

"సరాగమాలలో రెండు వారాల క్రితం మీ విశాఖ పర్యటన గురించి యెందుకు వ్రాశారో అర్థం కావటంలేదు." నాయుడు పేట నుంచి ప్రణతు గుప్తులని పిలవబడు పెన్నెపల్లి గోపాలకృష్ణారావు (గోపి). వీరు 'సై సై' పాటను త్వరలో పరిచయం చేయమన్నారు. త్వరలోనే చేయగలను.

"మీ ఆంధ్రదేశ పర్యటన విశేషాలు చదివి ఆనందించాను. మీరు వ్రాసే ప్రతి విషయంలోను నూతనత్వం ఉంటుంది.. అందుకే అందరికీ అంత ఉత్సాహం సరాగమాలంటే." శివ , , మద్రాసు.

"ముఖ్యంగా ఈ వారం సరాగమాలలో మీ ప్రయాణం విశేషాలు చదువుతుంటే యెంతో హాయనిపించింది" శ్రీమతి ఎస్ ప్రమీల, హైదరాబాదు.

కొండపల్లి వెంకటేశ్వరరావు గారికి జవాబు : ఘంటసాల పాడిన "ఏడుకొండలవాడ", "నమో వెంకటేశా" మొదట రేడియోకోసం సిద్ధం చేయబడిన వనుకుంటాను. తరువాత రికార్డులుగా వెలువడినవి. ఇంతవరకు యే చిత్రంలోను వాటిని ఉపయోగించ లేదు.

మద్రాసు నుంచి ఒక పఠిత : "ఔత్సాహిక గాయకులకు మీరిచ్చిన సలహాలు చాల సమంజసముగా నున్నవి. వీరిని ప్రోత్సహించి తగు అవకాశం ఇచ్చి వారి ఉన్నతికి రేడియో వారు, నిర్మాతలు నిజంగా శ్రద్ధ వహించవచ్చు. కాని సంగీత దర్శకులు నిర్మాతలైన రోజు. రేడియో నిర్వాహకులు ఔత్సాహిక గాయకులకు 'అమృతాంజలి' వంటి కార్యక్రమాలు నిర్వహించిన రోజు నూతన గాయకులకు మంచి భవిష్యత్తు ఉండగలదు." తథాస్తు!

"చిత్రాలలోని టైటిల్ మ్యూజిక్ రికార్డులుగా యెందుకు విడుదల చేయరు ?" సాధారణంగా మన చిత్రాలలో టైటిల్ మ్యూజిక్‌లో ఒక ప్రత్యేకత అంటూ ఉండదు. పెళ్లి మేళంలా వాయించబడిన ఒక త్యాగరాజ కృతిని వినిపించటమో ఆ సినిమా పాటల పల్లవులను కలగా పులగీకరించి వినిపించటమో జరుగుతుంది. ఇవి రికార్డులుగా వస్తే చెల్లవు. ఒకోసారి ఈ టైటిల్ సంగీతమే విశిష్టమైన పద్ధతిలో తయారు చేయటం జరుగ



"అనుబంధాలు"లో గుమ్మడి కృష్ణకుమారి

వేళే బా మోహనా" (కన్నడం) గోపాలం కంఠం ఇందులో కోమలకు అనుస్వరాలు మాత్రం పలికినా దానంత అందం ఇందులోనూ ఉంది

* * *

సుమారు ఒక సంవత్సరం క్రిందట ఆత్రేయ ఆర్ట్స్ అకాడమీ వారు "తిరుపతి" అనే నాటకాన్ని మద్రాసులో ప్రదర్శించారు అందులోని మూడు పాటలను, ఆత్రేయ రచనలు, పెండ్యాల స్వర పర్చగా పి బి శ్రీనివాస్, ఎస్ జానకి పాడారు ఆ మూడు పాటలను కొలంబియా వారు ఇప్పుడు రెండు రికార్డులుగా విడుదల చేశారు వాటి నంబరు జి ఇ 37541—37542 మొదటి దానిలో జానకి పాడిన రెండు పాటలు ఉన్నాయి ఒకటి 'చెక్కిలి యెరుపెక్కును, సిగ్గు మొగ్గ వేయును, చిరునవ్వు పూయును, చిఱు చెమటలు పోయును" ఎప్పుడూ ? "ఎదురుచూచు ప్రియుడు కనుల యెదుట నిలచినప్పుడు" అంతే కాదుట కన్నులు బరువెక్కునట వెన్నెల వేడెక్కునట పైగా కన్నె మనసు కరిగి కరిగి పోవునట ఈమాటల మెఱుకులకు తోడై పెండ్యాల అమర్చిన విని వినిపించనంత తేలైన వాద్యగోష్ఠి వరసలో లేని గొప్ప దనం, కొత్తదనం ఆ వాద్యానుసరణలో ఉంది రెండవప్రక్క గూడ రచనదే పైచేయి "మనసుకు వయసున్నదా, మధువుకు సొగసున్నదా, ఉనికికి దరిఉన్నదా, తనువుకు స్థిరమున్నదా" ఇందులో వినిపించే కొన్ని ప్రశ్నలు ఈ రెండు పాటలు జానకి అతి తేలికగా చిరుగాలి కెగిరే చిగురుటల లాగా పాడింది

రెండవ రికార్డులో ఒక ప్రక్క "చెక్కిలి యెరుపెక్కును" వెనుకప్రక్క శ్రీనివాస్, జానకి యుగళ గీతం "ఇదే చెలి" అన్న రాగమాలిక ఇందులో సితారుల సన్నాహం యెక్కువ వరస మాటలకు తగినట్లు హాయిని గొలుపుతున్నది పెండ్యాల ప్రతిభ ప్రత్యేకంగా గాయకులకు ఏర్పర చిన సంగతులలో విశదమవుతున్నది అంత హాయి గానూ పాడటం శ్రీనివాసునకు వకుళ పెట్టిన వెన్న జానకికి భూమి నేర్పిన విద్య

## సరాగమాల జవాబులు

ఒక పాఠకుని లేఖ బ్రాకెట్లలోవి నా మాటలు

"మధుర సంగీత భావ, సరస సాహిత్య మిళిత సరాగమాల మధుమాస శర్వరిలో మందమలయా నిలంలో పికకూజితంలా మనస్సును దోచుకుంది ఆదరంతో వ్రాసిన మీ లేఖ అందినది అభిమాన పాత్రులైన మీ అడ్రసు తెలుసుకోగల అర్హత నాకు లేనందుకు చింతిస్తున్నాను (పత్రికలలో శీర్షికలు వ్రాసేవారి యింటి అడ్రసు తెలుపక పోవటం, ఆఫీసు అడ్రసుకే పఠితలు ఉత్తరాలు వ్రాయటం అనాదిగా పాత్రికేయులు జరుపుతున్న మర్యాద అంతకుమించి అర్హతల ప్రసక్తి ఇందులో లేదు) మీరు ఒక పత్రికలో ఒక శీర్షిక నిర్వ హిస్తున్నారనే ఉద్దేశంతో వ్రాయలేదు మీకు సరాగమాలలోని మధుర భావాలు, గీతాల భావాన్ని మన్ననపరచి హృదయాన్ని గిలిగింతలు పెట్టే మీ సాహిత్యం నా మనసుని దోచుకుని వివశుణ్ణి చేశాయి (అందులో చాలమట్టుకు ప్రతిబింబిత మైన పతిభే) సంగీత సాహిత్యలమీద అభిమానం అలాగే ఉంటుంది కాబోలు అందుచేత నా హృద యంలో మిమ్మల్నొక భావనా మూర్తిగా సంస్థా

51 వ పేజీ చూడండి



మంచి రోజులు వస్తాయి లో జమున !

# మనము — మన దేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

# జఠరాశయంలో కేన్సర్:

గత వారాల్లో బాధాకరములయిన జఠరాశయ రోగములను గురించి వివరించాను. అవి బాధాకరములయినా, శీఘ్రకాలంలో ప్రాణహాని కలిగించేవి కావు.

అజీర్ణ మనేదే ఎరుగని వ్యక్తిలో ఆకారణంగా అజీర్ణ లక్షణములు—కడుపులో నిండుగా ఉండడం, ఆకలి మందగించడం, త్రేన్పులు, నిరంతరముగా ఉండే నొప్పి—ఏర్పడినప్పుడు, కొద్ది రోజులలో, ఆ లక్షణములు ఉపశమించినప్పుడు, ఎంత శీఘ్రముగా జఠరాశయమును ఆధునిక పరీక్షా విధానముల ద్వారా పరిరక్షించుకో గలిగితే అంత మంచిది. ఈ పరీక్షలు వైద్యసహాయం లేకుండా జరిగేవీ, జరిపించుకోగలవీ కావు. ఈ లక్షణములు ఏర్పడిన వారు—మధ్య వయస్కులూ, అది దాటినవారూ అయితే అసలే తాత్సారం పనికిరాదు. ఎందుకంటే ఈ లక్షణములు జఠరాశయంలో కేన్సరు అంకురావస్థలో ఉన్నప్పుడు ఏర్పడిన లక్షణములు కావచ్చును!

(1) ప్రమాదము, (2) ఇన్‌ఫ్లమేషను, (3) శిథిలత్వము, (4) దుర్మాంస వృద్ధి అని రోగములు నాలుగు రకములుగా విభజించబడ్డవని ఇదివరకే తెలుసుకున్నాము. ఇందులో కేన్సరు దుర్మాంస వృద్ధికి చెందిన వ్యాధి ఇంగ్లీషులో ఈ స్థితిని 'నియోప్లాజము' (Neoplasm) అంటారు 'నియో' అంటే నూతనమైన, 'ప్లాజం' అంటే జీవ వస్తువు అని ఈ మాట కర్థం. జీవిత కార్యక్రమానికి ఫలితంగా కొన్ని జీవకణములు నశిస్తూ ఉంటవి. మరికొన్ని జీవకణములు కొంతవరకు పెద్దవి కాగానే, విభజన పొంది నశించినవాటి స్థానమును భర్తీచేస్తూ ఉంటవి. పెరిగే స్థితిలోనూ, రోగ ఫలితంగా కృశించిపోయిన రోగి కోలుకుంటున్నప్పుడు ఈ విభజన అధికంగా ఉంటుంది. అప్పుడు శరీర ధాతువులు 'వృద్ధి' చెందినవి అంటాము వృద్ధాప్యంలోనూ, కొన్ని వ్యాధులలోనూ నశించిన జీవకణములన్నీ పునరోత్పత్తి కావు. కాని వయస్కులలో, ఆరోగ్యస్థితిలో జీవకణముల ఉత్పత్తీ, సంహారమూ సమానంగా ఉంటవి. అప్పుడు మనిషి—బరువు మారదు. వివిధాంగముల అన్యోన్య ప్రమాణము మారదు. కొన్ని పరిస్థితులలో ఒక అంగంలో ఉన్న వివిధ ధాతువులలో కొన్నింటిలోనో, అన్నింటిలోనో ఉన్న జీవకణములు, విపరీత సంఖ్యలో విభజన పొంది, ఆ ధాతువు ప్రమాణం తప్పి అధిక—వృద్ధి చెందుతుంది. ఈ స్థితిని 'మాంస వృద్ధి' అంటారు. ఆ వృద్ధి అతి శీఘ్రమైనప్పుడూ, ఆ జీవకణములు రక్తం ద్వారా శరీరంలో ఇతర అంగములకు పోయి, అక్కడ స్థావరం ఏర్పరచుకొని వృద్ధి చెందేవైనప్పుడు, ఆ వృద్ధి పరిసర ధాతువులను నశింపజేసి వాటి స్థానంలో తాము వృద్ధి చెందినప్పుడూ ఆ మాంసవృద్ధిని దుర్మాంస వృద్ధి అంటారు దీనినే ఆంగ్ల వైద్య పరిభాషలో 'మేలిగ్నెన్సీ' (Malignancy) అంటారు. ఈ దుర్మాంస వృద్ధి, ఏ ధాతువులలోనైనా ఏర్పడవచ్చును. (జీవకణ వృద్ధి, విభజన, చర్చిస్తున్నప్పుడు ఈ విషయం వివరించాను. పాఠకులు ఆ వ్యాసాలు మిళ్లీ చదువుకుంటే మంచిది) శరీరాంతరాళములను క్రమ్మిఉండే మ్యూకస్ పొరలో ఉండే జీవకణములు అతివృద్ధీ దుర్వృద్ధీ పొందినప్పుడు కేన్సరు ఏర్పడుతుంది. దీనినే వైద్య పరిభాషలో 'కార్సినోమా' (Carcinoma) అంటారు. దుర్వృద్ధి శల్య ధాతువులలో ఏర్పడినప్పుడు 'ఆస్టియోమా' అనీ, కండరములలో ఏర్పడినప్పుడు సార్కోమా అనీ వివరించబడుతుంది. ఈవిధంగా ఒక్కొక్క ధాతువులో ఏర్పడే దుర్వృద్ధికి ఒక్కొక్క పేరు ఉంటుంది. గ్రీకు, లాటిన్ భాషలలో ఆయా ధాతువులకు ఉండే పేర్లనుబట్టి వాటినుండి ఏర్పడే కణుతులకు ఆయా నామములు ఏర్పడుతవి. కాని సాధారణ ప్రజానీకము ప్రతి దుర్వృద్ధినీ కేన్సరుగానే పరిగణిస్తున్నది. ప్రస్తుతం జఠరాశయపు మ్యూకస్ పొరలోనూ అందులో ఉండే గ్రంథులలోనూ ఏర్పడే కేన్సరును గురించి చర్చిస్తున్నాను.

జఠరాశయంలో కేన్సరు ఎక్కువగా మగవారిలో ఏర్పడుతుంది. జఠరాశయపు కేన్సరుతో బాధపడేవారిలో నూటికి 75 మందికి పైగా మగవారై ఉంటారు. ఇందుకు సరి అయిన కారణం ఎవరికీ తెలియదు. దీర్ఘకాలం ఒక ధాతువు ఇరిటేట్ అయినప్పుడు అక్కడ దుర్వృద్ధి ఏర్పడడానికి అవకాశం ఉంది. మగవారిలో చాలామంది ఉద్యోగాదులవల్ల ఇంటిపట్టున ఉండక, వేళ తప్పి ఊరికో రకమైన భోజనం చేస్తూ ఆందోళన కలిగించే పరిస్థితులు ఎదుర్కొంటూ తిరుగుతూ ఉంటారు. ఆల్కహాలున్న పానీయములు సేవించే వారిలో పురుషులే అధికంగా ఉంటారు. ఇందువల్ల వారిలో తరుచు జఠరాశయం ఇన్‌ఫ్లేం అవడమూ, అది దీర్ఘ స్థితిని అందుకోవడమూ, చివరకు కేన్సరుగా పరిణమించడం ఒక కారణం కావచ్చు, రోగరహితమై, ఆరోగ్యంగా ఉన్న జఠరాశయంలో కేన్సరు అంకురించదనే చెప్పాలి. కొన్ని కుటుంబాల వారిలో యిది పైతృకంగా సంక్రమిస్తుందనుకుంటానికి అవకాశం ఉన్నది. కొన్ని వృత్తుల వారిలో యిది అధికంగా ఉంటుందని చెప్పడానికి సాక్ష్యమేమీ లేదు. జఠరాశయంలో కేన్సరువల్ల మరణించేవారి సంఖ్య విదేశాల్లో దేశదేశానికీ మారుతూ ఉంటుంది. కొన్ని దేశాల్లో జఠరాశయంలో కేన్సరు, సంపన్నులలో కంటె పేద వారిలో అధికంగా కనుపిస్తూన్నది ఈ వ్యత్యాసములు శరీరంలో ఇతర అంగములలో ఏర్పడే కేన్సరులకు అన్వయించవు. గ్రామవాసులలో కంటె, నగరవాసులలో ఎక్కువగా కేన్సరు కనిపించింది కాని, గ్రామజీవితంలో ఒకప్పుడుండే సల్లక్షణాలు ఈ నాడు క్రమంగా నశించి పోతున్నవి. ఆరోగ్యరీత్యా నగర—జీవితమే వాంఛనీయమేమో అన్నంతగా గ్రామ—జీవితం మారిపోయింది. సాధారణంగా కేన్సరు 45—60 సంవత్సరముల మధ్య వయస్సులో ఏర్పడుతుంది. ఒకప్పుడు 40 సంవత్సరములకు లోపల కేన్సరే ఏర్పడదని వైద్యులు భావించేవారు. కాని ఈమధ్య ఏ వయస్సు వారిలోనయినా, ముఖ్యంగా నగరవాసులలోనయినా చాలా చిన్నవారిలోనయినా కేన్సరు ఏర్పడవచ్చునని అనుభవంవల్ల తేలింది.

జఠరాశయ వ్రణములు దీర్ఘకాలంగా మాననప్పుడు అందులో కొన్ని కేన్సరుగా పరిణమించడానికి వీలున్నది. 'పైలోరస్' ప్రాంతంలో ఏర్పడిన అల్సర్లు కేన్సర్లుగా రూపొందే అవకాశం ఎక్కువగా కన్పిస్తుంది. అల్సరు కేన్సరుగా మారడం స్వల్పకాలంలో జరగదు. అల్సరున్న భాగములలో కేన్సరు జీవకణములూ, కేన్సరున్న భాగములలో దీర్ఘమైన ఇన్‌ఫ్లమేషన్ లక్షణములూ సూక్ష్మదర్శిని పరీక్షవల్ల నిర్ధారింపబడ్డవి. జఠరాశయంలో ఏర్పడే దుర్వృద్ధులలో నూటికి 99 కి పైగా కేన్సరులే అయిఉంటవి. ఇవన్నీ ఎక్కువగా, జఠర రసమును స్యందించే గ్రంథులనుంచే ఏర్పడుతవి. కేన్సరువల్ల ఏర్పడే అల్సర్లు పెద్దవిగా ఉంటవి. జఠరాశయంలో ఏర్పడే సాధారణ వ్రణముల వ్యాసం అంగుళమును మించి ఉండదు.

అజీర్ణ మెరగని వారిలో అజీర్ణ లక్షణములు ప్రారంభించినప్పుడు — ముఖ్యంగా 40 సంవత్సరములు దాటిన తర్వాత ఏర్పడ్డప్పుడు—కేన్సరు ఆరంభమవుతున్నదనుకోడం క్షేమకరమైన పద్ధతి. 'రోగం రొష్టు' అనే మాట ఈ విషయంలో ప్రాణరక్షణకు హేతువవుతుంది జఠరాశయ కేన్సరువల్ల ఏర్పడే లక్షణములు జఠరాశయంలో కేన్సరు ఏర్పడిన తావును బట్టి మారుతూ ఉంటవి. నాభికి పైనా, ప్రక్క ఎముకల కలయికకు క్రింద ఉన్న ప్రదేశంలో ఒక రకమయిన బాధ, సాధారణ లక్షణంగా ఉంటుంది. ఈ బాధ భోజనానంతరం అధికమౌతూ ఉంటుంది. ప్రారంభదశలో ఈ బాధ నిరంతరంగా ఉండదు. కాని, క్రమంగా ఈ నొప్పి విడవకుండా ఉంటుంది. భోజనానంతరం అధికతరమవుతూ ఉంటుంది. కొందరిలో ఈ నొప్పి భోజనానంతరం రెండు మూడు గంటలయిన తరువాత యేర్పడి, ఏదైనా తీసుకుంటే తగ్గుతూ ఉంటుంది. ఇదొక దురదృష్ట పరిస్థితి. ఎందుకంటే, ఈ లక్షణం జఠరాశయ వ్రణమును సూచిస్తుంది. ఇందువల్ల కేన్సరున్నదేమో నన్న సందేహం, అది ముదిరిపోయే వరకు కలుగదు కాని ఈ లక్షణం ఉన్న వారి జఠర రసమును పరీక్షిస్తే, అధికామ్ల స్థితి కనుపించదు. అల్పామ్ల స్థితి కనుపిస్తుంది. వ్రణచికిత్సతో ఆ బాధ తగ్గదు. అది దానంతటే మధ్య మధ్య నిలిచిపోదు. అల్సరు రోగిలో ప్రారంభదశలో ఆకలి తగ్గిపోవడం ఉండదు. కేన్సరు ఆరంభించగానే ఆకలి మందగించిపోతుంది. జఠరాశయంలో కేన్సరు ఏర్పడగానే మాంసాహారంమీద ఏవగింపు కలుగుతుంది. అంతకుముందు మాంసం లేకుండా ముద్ద మింగనివారిలో ఈ లక్షణం ఏర్పడిందంటే కేన్సరును సందేహించవలసిందే.

అల్సరు కేన్సరుగా పరిణమించినప్పుడు, ఆకలి వెంటనే మందగించదు. క్షుద్రాహిత్యంతోపాటుగా, వాంతి అవడమూ, వాంతి వచ్చినట్లు ఉండడమూ సాధారణంగా కనిపించే లక్షణాలు. ఆకలి తగ్గకుండానే, వాంతి ఏర్పడవచ్చును కూడా. తరచు వాంతి వచ్చినట్లు ఉండడమే ఆరంభ లక్షణం కావచ్చును.

(సశేషం)

నిర్ణయించింది అంటే దానికి ఆధారం మన దేశం గాదు విదేశీ దిగుమతిదారు దయ!

*　　　*　　　*

ఈ వారంలోనే కార్మిక సమావేశం జరిగింది ఇక్కడ కూడా వివాదాలే ఎక్కువ ప్రాముఖ్యం వహించాయి ఇదికాక క్రమ శిక్షణా స్మృతి ఉండనే ఉంది ఇవన్నీకాక, కార్మిక శాంతి ఒప్పందంపై తీర్మానం కూడా ఉంది

శ్రీ గుల్జారీలాల్ నందా—అంటే మన కార్మిక మంత్రి, పడ్డ తాపత్రయమంతా ఈ కార్మిక శాంతి ఒప్పందంపై తీర్మానాన్ని కాపాట్టమే కాంగ్రెస్ పలుకుబడితో నడిచే భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు పక్షంకాని, కార్మిక నాయకులంతా నిర్బంధ పొదుపు పథకం మీద సంపూర్ణంగా వ్యతిరేకులుగా ఉన్నారు పైగా ఆ పథకం కార్మిక శాంతి ఒప్పందపు తీర్మానంలో భాగం కాదని, కాజాలదని కూడా అన్నారు ఐతే ప్రభుత్వం చెప్పేదేమిటంటే ఈ నిర్బంధపు పొదుపు పథకాన్ని వ్యతిరేకించే ప్రతి పక్షీయులు ఆ ఒప్పందపు తీర్మానము లోని ఆశయం, అవకాశాలను దృష్టితో ఉంచుకొని విమర్శించటం లేదని. “దేశ సంక్షేమం దృష్ట్యే అవసరమైన పొదుపు పెంపును దేశంలోని కార్మికులకే అందజేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది ఎక్కువ మొత్తాల పొదుపుకు వీలైయేటట్లుగా యజమానులు, నిర్వాహక వర్గాలు తగిన సదుపాయాలు చేయాలి” అంతేకాక, దేశంలోని పనివారంతా కనీసం ఒక రోజు కూలీ ఐనా నెలకొక తడవ రక్షణ పొదుపు నిధిలోనో, నిర్బంధ పొదుపు పథకంలోనో మదుపు పెట్టాలని కూడా ఈ కార్మిక శాంతి ఒప్పందపు తీర్మానం కోరుతోంది “అందువల్ల నిర్బంధపు పొదుపు పథక మనేది ఈ రూపంగా కార్మిక శాంతి ఒప్పందపు తీర్మానంతో ఏకీభవిస్తున్నది సాలీనా 1500 రూపాయలకు తక్కువ ఆదాయం కలవారు ఈ పథకంలో చేరవచ్చునేమో కానీ చాలా మంది కార్మికులకు ఇందువల్ల మంచి ఉపయోగం కలుగుతుంది అదీకాక, ఈ వరకే భీమా ప్రావిడెంట్ ఫండ్ వగైరాలలో 11% నిల్వ చేసిన వారి ఆదాయం సాలీనా 1500—3000 రూపాయల మధ్య ఉంటే అట్టి వారు గూడా ఈ పథకంలో చేరరు”

ఇవన్నీ బల్లగుద్ది చెప్పేవాటి మాటలు ఈ నిర్బంధ పొదుపు పథకం తయారయేటందుకు మూణ్ణెల్ల ముందు, అంటే నవంబరు 1962 లో ఈ కార్మిక శాంతి ఒప్పందపు తీర్మానం జరిగింది ఒకరోజు కూలీ, ప్రతి కూలి ఇవ్వటమనేది బడ్జెటుకు ముందున్న జీవన వ్యయాలనుబట్టి నిర్ణయించటమైంది ఇటీవల అతి భారంగా పన్ను విధింపు వచ్చి పడటంతో కూడ బెట్టటమే కష్టమైపోతోంది అందువల్ల నవంబరు 1962 నాటికి ఉన్న ధరల ప్రమాణాలకు నేటి ధరలను తీసుకుపోయే విషయం గూడ శాంతి ఒప్పందపు తీర్మానంలో భాగమని కార్మికు లంటున్నారు

మొత్తంమీద తేలుతున్న దేమంటే, కాంగ్రెస్ అనుకూలవర్గంవారు తప్ప, మిగిలిన కార్మిక ప్రతినిధులందరూ ఈ నిర్బంధ పొదుపు పథకాన్ని వ్యతిరేకిస్తున్నారు శ్రామికుల విషయంలో మాత్రం కార్మిక మంత్రి అటు శాంతి ఒప్పందాన్నీ ఇటు నిర్బంధ పొదుపు పథకాన్నీ వదులుకోవాలనే ఖాయ మౌతోంది అందువల్ల మంత్రిగారు తాము చేయగల్గిన పనులేవో చేశారు నిర్బంధ పొదుపు పథకాన్నిగూర్చి చర్చించే అవకాశంగల, శాంతి ఒప్పందం ఆచరణ సంఘాన్ని నియమించారు అంతేకాక, జీవన వ్యయం పెరుగుతున్న కారణంగా, ఈ పథకంలో పొదుపు చేయటానికి తమకుగల అశక్తతను కార్మికులు తెలుపుకోవచ్చని కూడా ఆయన ఆ సమావేశంలో వెల్లడించారు

వ్యవసాయోత్పత్తుల పైన ప్రణాళికా సంఘం నియమించిన సంఘం నివేదిక పూర్తయింది. వ్యవసాయక ఉత్పత్తుల విషయంతో పని చేసే అన్ని వర్గాలను కలిపి వేయాలనీ శ్రీ యస్ కె పాటిల్ అభిప్రాయాన్ని ఈ సంఘం కూడా బల పరచినట్లు తెలుస్తోంది వ్యవసాయ, నీటి వనరులు (పంట కాల్వలు) సమాజ వికాస శాఖలు మూడూ వ్యవసాయోత్పత్తులకే కృషి చేస్తున్నా, వీటికి వేరు వేరు మంత్రిత్వశాఖలున్నాయి అంటే శ్రీ పాటిల్ చేసిన ఈ సూచనవల్ల అటు వ్యవసాయోత్పత్తి లక్ష్యానికి, ఇటు ఉద్యోగాల లక్ష్యానికి పోటీ ఏర్పడుతుందన్నమాట నెహ్రూగారికి అతి ప్రియమైన సమాజ వికాసం పైన విమర్శ కూడా వుంది పరిశోధక సంఘాలు, నిపుణ మండలులు, అంచనాల సంఘం ఈ మహా కార్యక్రమాన్ని గత ఆగస్టులో నిర్వహించాయి అయినా రవ్వంత ఫలితం కూడా కన్పడలా! మాయా మాంత్రికుడు శ్రీ యస్ కె డే, రోజు రోజుకు అధికార రూపంగ ప్రతిష్ఠను పొందుతూనే ఉన్నారు ఆఖరికి ఫోర్డు సంస్థ కూడా ఆయనకి యోగ్యతా పత్రా న్నొకదాన్ని ప్రసాదిస్తే!

శ్రీ నెహ్రూగారి మనసు గుర్తించి, ప్రణాళికా సంఘం వ్యవసాయోత్పత్తులమీద పరిశీలనకు నియమించిన ఉప సంఘం దేశంలోని వివిధ వ్యాపార సంస్థలు, వ్యవసాయోత్పత్తి పేరిట ఒక సహకార సంఘాన్ని ఏర్పరచాలని సిఫారసు చేసింది అలాగే కేంద్ర మంత్రివర్గం ఉన్నదనుకోండి, అది కూడ సహకారంతోటే నడుస్తుందిదనుకోవాలి ప్రధాన మంత్రి కార్యాలయం కూడా సహకారానికే ఉపయోగిస్తున్నారు అసలు టి టి కృష్ణమాచారి మంత్రిత్వాన్ని కొత్తగా సృష్టించింది కూడా సహకారం కోసమే సరే ప్రణాళికా సంఘం సహకరించేం

—48 వ పేజీ చూడండి

పదవీవిరమణజేసిన శ్రీ గాల్ బ్రెత్, రాయబారిగా పదవీస్వీకారంచేసిన శ్రీ చెస్టర్ బౌల్స్‌లు ప్రధాని శ్రీ నెహ్రూతో






## జరిగినకథ

వాల్తేరు పోయి ఎమ్మేకి అప్లికేషన్ పెట్టి గుంటూరు వస్తూ బెజవాడలో భాస్కరం—నేస్తం పద్మావతి తన నేస్తం సురేఖను భాస్కరానికి పరిచయంచేస్తుంది. భాస్కరం పిన్ని జానకమ్మగారు కూతురు వసంత పెళ్లిచేద్దామనీ, తర్వాత భాస్కరంపెళ్లి చేద్దామని, ప్రయత్నాలు చేస్తోంది. సురేఖవాళ్ల దొడ్డమ్మగారిదీ బెజవాడే. చదువు వంక మీద భాస్కరంపెళ్లికి విముఖత చూపుతూ౦టాడు. కానిజానకమ్మగారి ముచ్చటవేరు. ఆమెకు అధికారం, ప్రేమా—రెండూ ఎక్కువ. ధనమ్మ రాఘవేంద్రరావులు వసంతను ముకుందరావుకు చేసుకోడానికి చూశారు. భాస్కరం విముఖతను పసిగట్టిన వసంత భాస్కరాన్ని నిలదీస్తుంది. జానికమ్మగారి బలవంతాన పెళ్లిచూపులకని వెళ్ళి అక్కడ సురేఖను చూసి హతాశుడైపోయాడు.

# 14

పద్మావతికీ సురేఖకీ అరమరికలు లేవు. ముఖ్యంగా ఒకమ్మాయి ప్రేమ వ్యవహారంలో పరిభ్రమిస్తున్నప్పుడు, తన గుండెలకు దగ్గరగా ఉన్న మరో నేస్తాన్ని ఎన్నుకుని కబుర్లు కధలూ చెప్పుకుంటుంది. సురేఖకు స్పష్టంగా పద్మావతి మనసులో భాస్కరం మూర్తీభవించి కూచున్నాడని తెలుసు.

భాస్కరం గురించి స్వయంగా తనకు గలిగిన పరిచయంవల్ల ఆమెకు తెలిసింది చాలా తక్కువ. "అతను మంచివాడే .... ఆఖరికి మొన్న పార్కులో కూడా ఒక్కమాటు కూడా తనను చంచల దృష్టితో చూడలేదే ?" అనిపించింది.

"పద్మావతి గుండెలు తీసేపని నే చెయ్యలేను.... భాస్కరం పద్మావతి నేస్తం కాదని తెలిస్తే అది వేరేమాట ! నేను ఈ భాస్కరాన్ని వరించలేను — దొడ్డమ్మకి చెప్పేస్తాను" అని మధనపడ్డది సురేఖ.

అయితే ధనమ్మగారు మాత్రం భాస్కరం చెక్కిన విగ్రహంలాగ, తీర్చిదిద్దిన బుద్ధిమంతుని లాగ ఉన్నాడనే నిర్ణయానికి వచ్చేసింది. ఆమె వూహలు ఆలోచనలా ఎవరి అదుపు ఆజ్ఞలకు లొంగవు కదా!

* * *

తిరిగి యింటికి వస్తున్నప్పుడు భాస్కరం చెరుపు చేసినట్లు దిగాలుపడి ఉండటాన్ని జానకమ్మ గ్రహించింది. గాభరాపడ్డది. కూడా .... "పోనీ ఈ సమ్మంధం వద్దురా !" అని పైకి వాడిని సంతోష పెట్టడానికి అనాలనుకుంది గాని "చూస్తూ చూస్తూ నిక్షేపంలాంటి సమ్మంధాన్ని ఎలా కాదంటామూ ?" అని అందామనుకున్న మాట అలాగే మింగేసి,

"ఏరా ! భాసా ! తల నొప్పిగా ఉందా ?" అనడిగింది.

"లేదు."

భాస్కరం ముభావానికి వసంతా, సుబ్బారావు గారూ కూడా నొచ్చుకున్నారు.

"అన్నయ్యకి పెళ్లి యిష్టంలేదు" అని బయటకి వినపడకండానే అనుకుంది వసంత.

"ఎందుకో అడగనా ?" అని తలపోసింది.

సుబ్బారావుగారు "చుట్ట కాల్చుకొందునా ?" అనుకున్నారు.

కాని పిల్లలందరి ఎదుటా, బండీలో చుట్ట కాల్చగల ధైర్యంలేక వూరుకున్నారు.

రెండు మూడుసార్లు జానికమ్మగారు మాత్రం ఏదో అనబోయి అనక మాట్లాడుతాంలేమ్మని వూరుకున్నది.

ఆమెకు 'సురేఖ' సమ్మంధం రానురాను సమ్మతమవుతున్నది.

* * *

భోజనాలకు అంతా యాంత్రికంగా లేచారు. వసంత అన్నయ్య ప్రక్కనే కూచుని తదేకంగా అతనికేసే చూస్తున్నది. భార్య ఎప్పుడే క్షణాన ఏమాట అంటుందో—నన్నట్లు సంసిద్ధంగా కూచున్నారు పీటమీద సుబ్బారావుగారు. శిక్ష పడ్డవాడు అనుభవించడానికి అంగీకారం తెలుపుతున్నట్లు తల దించుకుని కూచున్నాడు భాస్కరం.

"ఊఁ .... మీరు కూచోండి ! పిల్లలు ఆకలితో ఉన్నారూ" అన్నది జానికమ్మ. అంటూనే నెయ్యి వడ్డించి

"ఏమో బాబూ ! నా కోడలు మరీ 'ఎమ్మే, ఎప్పే' లు చదవడం నాకు నచ్చదు" అన్నది.

'కాని ఈ అమ్మాయి ఎమ్మే చదువుతుందిట. ఆనక ఉద్యోగం చేస్తుందిట.' భాస్కరం ఆశగా అన్నాడు.

పిన్నికి "ఇక ఈ సురేఖ వైనం నచ్చదు" అనుకున్నాడు—రెండు మెతుకులు మునిపంట కొరికాడు. ఆశగా ఆమెకేసి చూశాడు.

"ఎవరన్నార్రా నీతో ?—చెప్పిందా ?" ఆమె కూర వెయ్యబోతున్నదల్లా ఆశ్చర్యపడి నిలబడ్డది—

"వద్దనేస్తాం, అంతేగా" అంటూ వసంత సలహా యిచ్చింది—అన్నయ్య మాటాడకండా ఆదుకుని—

"మరేఁ" అన్నాడు భాస్కరం. అతని ఉద్దేశం ఈ సమ్మంధం వొద్దనేస్తామని—అంచేతనే వెంటనే అంగీకారం చూపించాడు. కాని, జానికమ్మగారికి ఈ సలహా మరో రకంగా అర్థమైంది. "ఆ అమ్మాయిని ఉద్యోగం వొద్దనేస్తామని" అనుకున్నదామె.

"మా బాబే ! వెయ్యేళ్లాయుష్షు—లేపోతే అయినింటి కోడలికి ఉద్యోగా లెందుకు చెప్పూ ?" అన్నది.

గతుక్కుమన్నాడు భాస్కరం—

"అది కాదు పిన్నీ .... " అన్నాడు.

"ఏది కాదూ ?"

"నాకు యీ సమ్మంధం ఎందుకనో నచ్చలేదు." అందామనుకున్నవాడు భాస్కరం నోరు మెదపలేదు.

"వసంత పెళ్లి అభాసు అవకూడదు" అనుకున్నాడు. అదే గొణుక్కున్నాడు.

"అది సరేగాని, నువ్వు ఆ అమ్మాయి పాట పాడనందుకు కోపగించుకున్నావుకదూ ? మరి దాని వూసెత్తవేమ్" సుబ్బారావుగారడిగాడు.

"సిగ్గు కాబోలు నాన్నా !" వసంత చెప్పింది.

"సిగ్గేమిటి ! ఇరవైయేళ్లు ముడ్డి క్రిందకు వస్తున్నాయి—స్వాతిశయం అంతా ఆ ధనమ్మ పెంపకం.... పోన్లే. నేనేం పాటలు పాడుతున్నాను గనుక." అన్నది జానకమ్మగారు.

జానికమ్మగారికి సురేఖ ఎందుకనో "నచ్చింది" అన్నమాట. ఆమె "అయిష్టత"వల్ల కూడా స్పష్టమవుతూన్నది.

అదే భాస్కరాన్ని మరింత కుంగదీసింది.

వసంతా, భాస్కరం లేచి చేతులు కడుక్కున్నాకా రహస్యంగా జానికమ్మగారు భర్తతో "మన వసంత

సమ్మంధం స్థిరపడాలి అంటే మనం సురేఖను ఒప్పుకోవా లనిపిస్తోందండీ" అన్నది.

"సురేఖకేం తక్కువ ?" సుబ్బారావుగారు తన అంగీకారంతోపాటు "తప్పించుకు తిరుగువాడు ధన్యుడు సుమతీ" అనే తన పాలసీని కూడా బయట పెట్టుకున్నారు.

"మరి భాసడు కట్నం వొద్దంటున్నాడండీ !"

"వసంతకు యివ్వద్దంటాడా ?"

"నా కర్మ ! .... మీ కొడుకు తత్వం నాకు ఇంత పీనరు బోధపడదు .... వసంతకు సర్దావడి యివ్వ వచ్చునట గాని మనం పుచ్చుకోకూడదుట .... ఇదేం చట్టమో" నన్న దామె.

సుబ్బారావుగారు లాయరై పోయాడు.

"ఇదుగో అమ్మాయ్ ! విను....మొదటది వాడు నీ కొడుకు. మీ కొడుకు అని అనవాకు—నా కొడుకే అయితే 'లాయరీ' వెలిగించును—నువ్వే సైన్సు చదివించావు—లౌక్యం లేకుండా చేశావ్ ? పోతే చట్టాన్ని ఏమీ అనకు— దాన్ని చదువుకుని నేను బ్రతుకుతున్నాను" అన్నా డాయన.

"బాగానే ఉంది వరస." అని మళ్లీ ఆమె "ఒక్కటి తోస్తున్నదండీ" అన్నది భర్తకి తాంబూలం అందించి.

"ఏమిటే అంటే— ఈ సమ్మంధం ఖాయ పర్చుకుని — పై ఏడాదికి ఈ పెళ్లి చేయుడం— ఈ ఏడాది వసంతకు ఆ మూడు ముళ్ళూ వేయించడమూను...." అన్నది.

"బాగుంది."

"ఈలోగా ఆ అమ్మాయిని ఓ ఏడాది చదువుకోమందాం...."

"నీ ఇష్టం" — సుబ్బారావుగారు పగటి నిద్రకు కాస్త అవకాశం దొరికితే చాలు "దాసుడు" గనుక ప్రక్కమీద వాలి అటుతిరిగి 'గుర్రు' పెట్టసాగాడు.

జానికమ్మ అవతలిగదిలో కొడుకు కూతురు ఏం చేస్తున్నారో చూద్దామనుకొన్నది గాని ఆమెకు లేవ బుద్ధి వెయ్యలేదు.

భర్తకు విసురుతూ కూచున్నది. భోజనానికి కూడా లేవలేదామె.

"వాడు పెళ్లి అంటే మొరాయిస్తున్నాడు. బహుశా సంసారం క్రుంగిపోతున్నదని బెంగ కాబోలు అంతే.... లేకపోతే ఈ ధనమ్మ సమ్మంధంలో, లోపమెక్కడ ? అమ్మాయి చదువుకున్నదీ అన్న అభ్యంతరం తనకి ఉండాలిగాని తన కొడుక్కి కాదు గదా ?"

"కట్నం వద్దూ, అంటే పోనీ మానేస్తానూ ?"

"అమ్మో ! ఎంత పరువుతక్కువ .. గతిలేని వాడా ? గోత్రంలేనివాడా ? వాడు ఛీ ! నేను ఒప్పుకోను.... కట్నం తీసుకోవాల్సిందే.. కావా లంటే వాడిపెళ్ళాంపేర బ్యాంకులో వేసుకోమను.. నాకేం కావాలా ?" ఇలా తలపోస్తూనే ఆమె లేచి ఒక్క ఆవేశాన భాస్కరాన్ని "భాసా" అని కేక వేసింది.

భాస్కరం వసంత కూడా గాభరాగా వచ్చారు.

ఆమెలేచి వంటఇంటికేసి వెడుతూ "వసంతా! నాలుగూ ఎత్తిపెట్టమ్మా !" అన్నది.

భాస్కరం విర్విణ్ణుడై "అమ్మా ! నువ్వు భోం చేశావా ?" అన్నాడు.

"నీకు అంతగా నమ్మకం లేకపోతే నా పరువు కాపాడ్డానికి కట్నం తీసుకుని— అనక నీ పెళ్ళాం



పేర బ్యాంకులో వేసుకో" మన్నదామె కోపంగా. వాస్తవానికి ఆమె కనుకొలుకుల్లో అప్పుడే నీళ్లు నిండు కొన్నున్నాయి.

"ఛీ ! ఇదా పిలుపు !"

విసురుగా వెళిపోయాడు భాస్కరం.

"ఇంత అపార్థం చేసుకుంటావనుకోలేదు. పిన్ని" అని బాధపడ్డాడు.

వసంత "అమ్మా ! రామ్మా" అన్నది ఏమనాలో తోచక.

జానికమ్మగారాపూట అంతా కోపంగానే ఉంది. ఎవ్వరితోనూ మాట్లాడలేదు.

"నీ పెళ్లి ఎంతో నాకూ వాడిపెళ్లి అంతేనే", అన్నది ఒకటి రెండుసార్లు వసంతనుద్దేశించి.

"సవతి తల్లిని, గనుక వాడిలా నా మాట కాదం టున్నాడ"న్నదే ఆమె బాధ—

43—వ పేజీ చూడండి

# సేవింగ్స్ బ్యాంక్ ఖాతా మొదలుపెట్టండి




## నేషనల్ అండ్ గ్రిండ్లేస్

నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్‌లో సేవింగ్స్ బ్యాంక్ ఖాతా ప్రారంభించడం అతి తేలిక. ఇందుకు అయిదే అయిదు రూపాయలు చాలు. దీనికి సాలీనా నూటికి 3 రూపాయలు వడ్డీ లభిస్తుంది.

నేడే మీకు సమీపంలోగల స్థానిక బ్రాంచికి వెళ్ళి పూర్తి వివరాలు తెలుసుకోండి. మీ బ్యాంకింగ్ సమస్యలు ఎలాంటివి అయినా సమర్థవంతంగా, సాదరంగా మీ సమస్యలు పరిష్కరించేవారు మీకు స్వాగతమిస్తారు.

**1863**  **1963**

(ఇండియాలో బ్యాంకింగ్ వ్యాపారంలో ఎంచిన 100 సంవత్సరాలు)

## నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్ లిమిటెడ్

యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఇన్‌కార్పొరేట్ చేయబడింది • మెంబర్ల బాధ్యత పరిమితం

బ్రాంచీలు: మద్రాసు: 2, నార్త్ బీచ్ రోడ్డు; 378 నేతాజీ సుభాష్ చంద్రబోస్ రోడ్డు. (లాయిడ్స్ బ్రాంచి); 6, అర్మీనియన్ స్ట్రీట్; 158, మౌంట్ రోడ్డు. హైదరాబాద్: అబీద్ రోడ్.

ANGB-59 TEL

# వ్యక్తిత్వం

రాధా రాఘవ్

ఒకరోజు అందరం కూర్చుని సరదాగా కబుర్లు చెప్పుకుంటూండగా, "నువ్వెలాంటి వాడిని చేసుకుంటావే అమ్మాయి!" అడిగాడు, మామయ్య, బి. ఏ. చదువుతోన్న మా వాసంతిని. వెంటనే తడుముకోకుండా రపీమని సమాధానం ఇచ్చింది వాసంతి, "వ్యక్తిత్వం గలవాడిని" అని. ఆమె మాటలు సరిగ్గా అర్థంకాక ప్రశ్నార్థకంగా ముఖాలు పెట్టారందరూ. "ఎవరైనా అయితే ఏ చదువుకున్నవాడో, బాగా డబ్బున్నవాడో పెద్ద ఉద్యోగస్థుడో కావాలంటారు. అదేం కాకుండా వ్యక్తిత్వం గలవాడి నంటున్నావు. అదొక్కటే ఉంటే సరిపోతుందా ?" అంది అత్తయ్య.

"ఆఁ! వ్యక్తిత్వం ఉండి, తిండికీ గుడ్డకూ లోటులేకుండా ఉంటే చాలు. అన్నీ ఉండి వ్యక్తిత్వం లేకపోయాక అలాంటి వాడిని చేసుకున్నా ఒకటే, చేసుకోక పోయినా ఒకటే" అంది.

"ఏమిటి సంగతి. వ్యక్తిత్వం గురించి ఇంత ఘాటుగా చెప్తున్నావు ?" అనడిగాను.

"ఏముంది ? పాతికేళ్ళు వచ్చినా పసి పాపలా ప్రతిదానికీ బుర్ర వూగిస్తూ, ఎంతసేపూ ఒక అభిప్రాయం అంటూ లేకుండా అమ్మనడగాలి, నాన్న నడగాలి అనే వాళ్లంటే అసహ్యం అవిపిస్తుంది. మొన్న ఏదో మాటల మధ్య మా కమల చెప్పిందిలే. వాళ్లబ్బాయి పుట్టిన రోజుకు పార్టీ అదీ ఎంతో ఆర్భాటంగా చేసుకోవాలని అనుకునే వారట, తనూ, వాళ్లాయనూను. ఒకరోజున, "పుట్టినరోజు దగ్గరకొస్తోందిగదా. ఎలా చేద్దాం?" అందట కమల.

"ఎలా చెయ్యాలో తర్వాత చూడొచ్చు గాని, ముందు మా అమ్మానాన్నా ఒప్పుకుంటారో లేదో? ఇంతడబ్బు తగలేసి ఇప్పుడివన్నీ ఎందుకని ఏమైనా అంటారేమో ! నెమ్మదిగా అడిగిచూడు" అన్నాడట.

వెంటనే కమలకు భలే కోపమొచ్చిందట. "అడగటానికి మీకు సిగ్గు లేకపోయినా నాకుంది. చంటి పిల్లాడికి సరదాగా చేసుకుంటూంటే, వాళ్లేం మిమ్మల్ని కొట్టేస్తారా ? చంపేస్తారా ? అంత భయపడుతూ, పడుతూ అడిగి చేసుకునే కంటే మానేయడం ఉత్తమం" అందట విసురుగా.

ఒక వయస్సువచ్చి, స్వంత కాళ్లమీద నిలబడగల శక్తి ఉండీ, ముచ్చటగా కొడుక్కి పుట్టిన రోజు చేసుకోవాలనున్నా అమ్మేమంటుందో, నాన్నగారేమంటారో అన్న భయంతో, జడిసేలాంటి వాళ్ళు ఒక్క కమల మొగుడేకాదు. అనేకమంది కనబడుతూంటారు, నిత్య జీవితంలో మనకు.

ప్రతి మనిషికి వ్యక్తిత్వం అనేది తప్పక ఉండాలి. మనిషికి నిండుతనాన్నిచ్చేది అదే ఆ వ్యక్తిత్వం ఉన్ననాడే మనిషి పరిపూర్ణుడవుతాడు. ఎన్ని అర్హతలున్నప్పటికి, ఇదిలేని నాడు వాళ్ళు శోభించలేరు.

ఈ మధ్య మా నేస్తాల ఇంట్లో ఒక పెళ్లికి వెళ్లాము. ఆ పెళ్లిలో వీళ్ళు ఎంతబాగా అన్నీ జరుపుతున్నా, మగపెళ్లివారు అలగాలి అనుకుని, చెట్టెక్కి కూర్చున్నాడు పెళ్లికొడుకు తండ్రి. ఆ ఆగ్రహాన్ని దింపడానిక్కాను ఆడపెళ్లి వారంతా తల్లక్రిందులవుతున్నారు. ఈ విషయం చెవినబడిన వెంటనే ఫ్రెండ్సు మధ్య కూర్చున్న పెళ్లికొడుకు లేచి వచ్చాడు.

"నాన్నగారూ ! పెళ్లికొచ్చి ఇలా గొడవలు పెట్టారన్నమాట ఏం బాగుండలేదు. లోటుపాట్లనేవి రావడం ఎవరికైనా సహజమే. సర్దుకు పోవడం అన్నది ధర్మం. మీరింక ఏం గొడవలు పెట్టొద్దు ఇప్పుడే చెప్తున్నాను. ఇంకేదైనా గొడవ జరిగినట్టు తెలిసిందా, నేను ఒక్కక్షణం ఇక్కడ ఉండను. ఇంకా ఈ జన్మలో మీరు నా ముఖం చూడలేరు" అన్నాడు.

అంతే. ఆ పెళ్లిలో మిగతా తంతు అంతా ఏ గొడవ లేకుండా సలక్షణంగా జరిగిపోయింది వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకున్నావంటూ అతని స్నేహితులందరూ ఎంతో అభినందించారు. చిన్న వాడైనా ఎంత తెలివైనవాడు, ఎంత బుద్ధిమంతుడు ! అని అందరూ పదే పదే అనుకో సాగారు. అలాంటి భర్త లభించినందుకు ఆ భార్యకు ఎంతానందంగా ఉంటుందో చెప్పలేము గదా.

సాధారణంగా పెళ్లిళ్లలో అనేక రకాల గొడవలు వస్తూంటాయి. అవి జరపలేదనో, ఇవి జరపలేదనో చెప్పిన కట్నానికి కొంచెం తక్కువయిందనో, మర్యాదలు తిన్నగా చెయ్యలేదనో, తమను అవమానపర్చారనో, ఏదో ఒక వంకతో మగపెళ్లివారమన్న అహంకారం చూపిస్తారు. ఆ కోపానికి బలయ్యే అమాయకులు నూతన వధూవరులు. తమ పట్టుదలకోసం పెళ్లికొడుకును తీసుకుని చక్కా వెళ్లిపోతారు పెద్దలు. ఇంక ఈ పెళ్లికొడుకు కూడ వచ్చటి తోరణాలైనా ఎండిపోనిదే, పసుపు బట్టలైనా మార్చనిదే గొడవలొచ్చాయి గదా అన్నబాధ



# ఇరుగు - పొరుగు

నరిపల్లి విద్యావతీశాస్త్రి

ఇరుగు పొరుగులతో మంచిగా మసలుట అనే వ్యాసం పేరిట నా అనుభవాలను కొన్నిటిని వ్రాయాలని సంకల్పించి వ్రాను కొంటున్నాను సహృదయంతో అర్థం చేసుకోగలరని ఆశ

మగవాళ్ల ఉద్యోగ రీత్యా మనం తెలుగు దేశంలో లోనే కాక ఏ ఇతర దేశాలలో (రాష్ట్రాలు) నైన ఉండుట తటస్థ పడుతుంది కొన్ని చోట్ల తెలుగు వారు చాలమంది ఉంటారు మరికొన్ని చోట్ల తెలుగు వారంటూ ఎక్కడైనా కన్పిస్తారా అనిపిస్తుంది అటువంటి ప్రదేశాలలో ఇతర భాషల వారికన్నా మనకు తెలుగు వారంటే ప్రత్యేకాభిమానం ఉంటుంది ఏ భాషల వారికైనా వారి భాషల వారంటే ప్రత్యేకాభిమానం ఉండడం సహజము కదా!

ఇరుగు పొరుగులన తెలుగు వారుండవచ్చును పైవారూ ఉండవచ్చును ఎవరైననూ సరే మనం సౌమ్యంగా ఉండడం మనకు కావలసినది కొంత మంది అందరి తోనూ సహృదయంతో, ఆత్మీయంగా మెలగుతారు మరికొంత మంది ప్రతి చిన్న విషయానికి కలహ మాడి జగువ్వ కలిగేలా ప్రవర్తిస్తుంటారు

నాకు తెలిసినంత వరకూ పై రెండు రకాలవారి గురించి వ్రాస్తాను రాయడంలో ఉద్దేశం అందరూ మొదట చెప్పిన విధంగా మెలగుటకు ప్రయత్నిస్తారనే! ..

మంచయినా, చెడ్డైనా వెనక చెప్పుకోవాలి' అంటారు మన పెద్దలు. నాకు పరిచయమైన రెండు కుటుంబాలు ఉన్నయి ఒకరు తెలుగువారు ఇంకొకరు కాశ్మీరీ వాళ్ళు ఆ గృహిణులు అక్కచెల్లెళ్ల కన్న ఎక్కువ సన్నిహితంగా మెలగుతుంటారు చాలా రోజులయింది పెళ్లి అని ఒకమారు కాశ్మీరీ స్నేహితురాలింటికి వెళ్లాను ఆమె మామూలుగా కాఫీ తీసుకువచ్చి ఇచ్చారు వాళ్లకు టీ త్రాగడం అసలు అలవాటు అందుకు నాకు ఎంతో ఆశ్చర్యం వేసి "ఏమండీ మీరు మదరాసీ వాళ్ళు అయిపోతున్నారేమిటండీ" అని అడిగాను అందుకామె "మదరాసీ సోదరితో స్నేహం మమ్మల్ని మదరాసీగా మార్చేస్తుంటే మరేం చేయమన్నారండీ" అని ఆమె నవ్వుతూ సమాధానం చెప్పారు వాళ్లకు కాఫీ, ఇడ్లీ మొదలగునవి అంటే చాలా ఇష్టము మొదట ఆమెకు తయారు చేయడము వచ్చేది కాదట, తెలుగామెతో స్నేహం కలసిన తరువాత అన్నీ ఆమె నడిగి నేర్చుకున్నారట. ఈ విషయం విన్న తరువాత నాకు ఎంతో సంతోషం వేసింది. వాళ్లింట్లో కాని, వీళ్లింట్లోకాని ఏ చిన్న ఫంక్షన్ అయినా వారిరువురూ కలిసే అన్నీ సమలూ చేసుకుంటారు. సాధారణంగా వారు సౌత్ ఇండియన్సని మదరాసీ వాళ్లని. కామన్‌గా పిలిచేస్తుంటారు. అందుకు నేనిక్కడ తెలుగుకు బదులు మదరాసీ అని వ్రాశాను.

నాకు తెల్సినామె ఇంకొకరు ఉన్నారు. వయసులో పెద్దయే. 'పిన్నిగారు' అని నేను పిలుస్తుంటాను. చాలా మంచి మనిషి. చిన్న వాళ్లతో చిన్న వారిలా, పెద్ద వాళ్లతో పెద్ద వారిలా మసలు కుంటారు. ప్రతివారితో ఎంతో ఆప్యాయంగా పలకరించి మాట్లాడుతారు. నేనామెతో మాట్లాడి నప్పుడల్లా నాకు ఆత్మీయులే గుర్తుకు వస్తారు. ఒక్కొక్కప్పుడు ఆత్మీయులు కూడా అంత సన్నిహితంగా ఉండరేమో అన్పిస్తుంది. అవసర సమయాలలో ఎటువంటి సహాయమైనా చేస్తారు. ఒకనాడు ఆమెకు తెలిసినామెను మరొకరిని తీసుకు మా ఇంటికి వచ్చారు. వారిద్దరికీ బాగా పరిచయం ఉన్నది. ఆమెతో పరిచయా మయ్యాక మాటల సందర్భంలో మీరు ఎక్కడ ఉంటున్నారండీ అని అడిగాను. దీనికి ఆమె "ప్రస్తుతం వీరింట్లోనే ఉంటున్నాను. మావారు అత్యవసర పనిమీద పైవూరు వెళ్లవలసి వచ్చింది. నేను మా పని మనిషిని సహాయంగా ఉండమని చెప్దా మనుకున్నాను ఆ రోజు ఈమె మా ఇంటికి వచ్చారు విషయం తెలుసుకొని వీరింటికి వచ్చేసి ఆ పదిరోజులూ ఉండమన్నారు "మీకు ఇబ్బంది ఎందుకండీ, అనవసరంగా అన్నానే కాని వీరి ఆప్యాయతకి వెళ్లాలనే అనిపించింది అయినా వీరు ఒప్పుకోనూ కూడా లేదనుకోండి" అని వివరాలుచెప్పి, ఆ తరువాత అసలు వారు ఎక్కడ ఉంటున్నదీ చెప్పారు జాతి మత భేదాల్లేకుండా ఆ పది రోజులూ అత్యంతాత్మీయంగా మెలగడం నాకు చాలా ఆనంద దాయకం అయింది ఒకవాడు వీరి చంటి వానికి ఆటల్లో బాగా దెబ్బలు తగలగా పిన్నిగారే హాస్పిటల్‌కి తీసుకు వెళ్లి, ఇంకా చాలా సాయపడ్డారు పిన్నిగారికి స్వపర భేదాలు లేవు మన తెలుగు వనితలు ప్రతివారిలోనూ భేదములు మరచి ఇంత సన్నిహితంగా మెలగుతున్నా

## టెన్నిస్ రాణి!



వింబుల్డన్ టెన్నిస్ స్త్రీల ఛాంపియన్ షిప్‌ను మొట్టమొదటి సారిగా గెల్చుకున్న ఆస్ట్రేలియా వనిత మార్గరెట్ స్మిత్ తాను గెల్చుకున్న ట్రాఫీని సగర్వంగా చూపెడుతున్నది.

# వ్యక్తిత్వం

ఒకవైపు ఉన్నా, అర్ధాంగి దయాచూపులు మనో ఫలకం మీద ముద్రించుకు పోయినా, తల్లి దండ్రులను ఎదిరించగల సాహసం లేక్, లేక ఇన్నాళ్ళూ కని పెంచిన తల్లిదండ్రుల మాట కంటే, ఇప్పుడొచ్చిన పెళ్ళాం బెల్లమయి పోయిందన్న మాట భరించాల్సి వస్తుందన్న భయంచేతో, తాళి కట్టిన పెళ్ళాన్ని ఆమె కర్మకొదిలేసి, మాత్రం కట్టడమైతే తన వంతుగాని, ఏలుకోవడం మాత్రం తన మీద ఆధారపడి లేదని నిరూపిస్తూ తల్లి దండ్రుల వెంట వెళ్ళిపోతాడు.

మరికొందరు పెద్దమనుష్యులుంటారు. ఇవ్వాల్సిన కట్నం పూర్తిగా ఇవ్వలేదనో, అబ్బాయి అలకపానుపు కోర్కెలు తీర్చలేదనో, అమ్మాయి వస్తువులన్నీ ఇవ్వలేదనో కాపరానికి తీసుకెళ్లడం మానేస్తారు. వీళ్ళ అరచి గీపెట్టినా ఆపిల్ల తండ్రికి వీటిని తీర్చగల స్తోమత ఉండదు.

ఇంతవరకూ వచ్చాక ఈ డబ్బుకోసం గొడవెందుకు ? ఆ అమ్మాయి జీవితం ఏ మవుతుందన్న ఆలోచన ఆ పెద్దలకుగాని, ఆ మహాపుత్రుడికీ గాని ఉండదు. బుద్ధిమంతుడిని, వినయ విధేయతలు గలవాడిని, తల్లిదండ్రుల మాటకు ఎదురు చెప్పని వాడిని అన్న సంతృప్తితోనే ఉంటాడుగాని, "తాళి కట్టాను గదా. అందర్నీ ఎదిరించైనా ఆమెను కాపరానికి తీసుకొద్దాం" అన్న జ్ఞానం అతనికి ఉండదు.

అంటే తల్లిదండ్రులకు అవిధేయత చూపించాలా ? అంటారేమో ? వ్యక్తిత్వానికి, అవిధేయతకు తేడా ఉంది. తల్లిదండ్రులు కనిపెంచిన వారు గాబట్టి వారిని గౌరవించాలి. పూజించాలి. కాని వారా గౌరవాన్ని పూర్తిగా గ్రహించ లేనప్పుడు, తమ పెద్దరికాన్ని ఎలా కాపాడుకోవాలో తెలీక దుర్వినియోజనం చేసి, హద్దు తప్పి ప్రవర్తించినప్పుడు, మన వ్యక్తిత్వాన్ని చూపించి వాళ్లకళ్ళు తెరిపించ వచ్చు. పెద్దరికం పేరుతో మూర్ఖపు పట్టుదలలకు పోయి అన్యాయంగా ప్రవర్తిస్తున్నప్పుడు వాళ్ళను సన్మార్గంలో పెట్టి నడిపించ వచ్చు. అప్పుడది అవిధేయత అనబడదు.

ఈ వ్యక్తిత్వం అనేది పురుషుల కెంతయితే అవసరమో, స్త్రీలకూ అంతే ముఖ్యము. ప్రతి స్త్రీకి స్వంత అభిప్రాయం, స్వతంత్రంగా ఆలోచించగల శక్తి ఉండాలి. ఎంతసేపూ ప్రతిదానికీ ఇతరుల మీద ఆధారపడి ఉండ కూడదు. కొందరు పెళ్ళయేవరకూ ఇంట్లో వాళ్ళందరిమీద, ఆ తర్వాత భర్తమీద ఆధారపడి ఉంటారు. ఏం చీర కొనుక్కోమంటారు ? ఏ రంగయితే నాకు బాగుంటుంది ? లగాయితు ప్రతి చిన్నపని ఒకరి నడిగి చేస్తుంటారు. ఇలాంటివారు స్వతంత్రించి ఏ ఒక్కపనీ చేయలేరు.

కొందరు పెద్దవారు, చిన్న వారిని వ్యక్తిత్వం ఉన్న మనుష్యులుగా పెరగనివ్వరు. తమ అభిప్రాయాలు, అభిరుచులు వారి నెత్తిన రుద్ది వాళ్ళకు వ్యక్తిత్వం లేకుండా తయారుచేసి, ఆ పైన తీరుబడిగా కూర్చుని, "ఒక వయస్సొచ్చినా వీళ్ళకు వ్యక్తిత్వం రాలే దంటూ" వ్యాఖ్యానిస్తుంటారు.

అలాగే కొందరు మహానుభావులు భార్యల వ్యక్తిత్వాన్ని పూర్తిగా చంపేస్తుంటారు. చిన్న పిల్లలా నీకా రింగులు చెవులకు ఏం బాగుంటాయనో, ఇద్దరు పిల్లలుట్టాక ఇంకా షోకుగా జాకెట్లు కట్టడమెందుకనో, నువ్వు ఎక్కువగా ఈ రంగు చీరలే కట్టమనీ, ఆ నేతచీరలు తప్ప ఒర్లిన్ చీరలు కట్టడానికి వీల్లేదనీ ఇలా ఆంక్షలు పెడ్తుంటారు. ఆమె కూడా ఒక మనిషేనని, ఆమెకూ అభిరుచులు, ఒక వ్యక్తిత్వం అంటూ ఉంటుందని గ్రహించరు.

ప్రతి మనిషికి వ్యక్తిత్వం ఉంటుంది. వారికి కొన్ని అభిప్రాయాలు, అభిరుచులు ఉంటాయి. వాటిని పెంపొందించడానికి పెద్దవారు తోడ్పడాలి గాని, తమ పెద్దరికం, అధికారం నిలబెట్టుకోవడం కోసరం వాటిని అణగద్రొక్కాలని చూడకూడదు. 

# వంటలు

## వేరుశెనగ పాకం

కావలసిన వస్తువులు :

| | |
|---|---|
| వేరుశెనగ పప్పు | 1 అర్ధాకు |
| పంచదార | 1½ అర్ధాకు |
| నెయ్యి | ఓ చెంచాడు |
| నీళ్లు | రెండవున్సులు |

వేరుశెనగ గింజల్ని గాని, పప్పుల్ని గానీ, ఓ చెంచాడు నెయ్యిలో వేసి బాగా వేయించాలి. బాగా చల్లారిపోయిన తర్వాత చేతుల్లో వేసుకు రుద్దితే ఆ పప్పుపైన ఉండే పొట్టు పోతుంది. ఓ గిన్నెలో పంచదార, నీళ్లు కలిపి బాగా చిక్కటి పాకం వచ్చే వరకు ఉడకబెట్టాలి. ఈ పాకాన్ని వేరుసెనగ గింజల లేదా పప్పుపైని పోయాలి. సరిచేస్తే అచ్చుమాదిరిగా తయారౌతుంది తర్వాత ఆ పాకాన్ని మనకు ఇష్టం వచ్చిన రూపాల్లో సైజుల్లో కోసుకోవచ్చు. పంచదారకు బదులు బెల్లం వాడినా బాగానే వుంటుంది. 

# వనితా వాణి

## ప్రధమ చికిత్స

హృదయశ్రీగారు వ్రాసిన ప్రథమ చికిత్స మాకెంతో నచ్చినది. ఇటువంటి వ్యాసాలు ప్రకటించిన మీకు మా అభినందనలు.

కె. జానకి, ఆర్. శ్యామల (రాజమహేంద్రవరం)

* * *

ఈ పరిస్థితులలో మావంటి స్త్రీలకు తెల్ప వలసిన ప్రథమ చికిత్సలో కొన్ని స్వల్ప విషయాలు (చిట్కాలు వంటివి) వారు చక్కగా వివరించి వ్రాశారు.

కుమారి పరిమి నాకమణి, కుమారి పరిమి జానకిమణి (గొల్ల పాలెం)

* * *

రచయిత్రి ఎన్నో తెలియని విషయాలను చక్కగా తెలిపారు. వాంతికి ఇంకో సులభోపాయము ఉంది. నెయ్యిలో ఉప్పువేసి దానిని హోటలోనికి ఇచ్చిన ఎడల తొందరగా వాంతి అవుతుంది. ఈ వస్తువులు సామాన్యముగా ఇంటిలో ఉండేవే కనుక చాలా సులభము.

కె. శ్యామలాదేవి, ప్రేమలత (కరీం నగరము)

## వంటలేనా ?

వంటలేనా? అంటారు కొందరు స్త్రీలుగాని వంటలులేనిదే వనితాలోకం శీర్షికకు ఆ పేరే తగదేమో... దయచేసి వంటలను వంట యింటి చిట్కాలను మానడం భావ్యం కాదు.

కుమారి వనజా (విజయనగరం)

* * *

ఈ మధ్య వంటల గురించి వ్యాసాలు "వనితాలోకం"లో ఎక్కువయి పోయాయి. వీటి బదులు వనితలు ఎదుర్కొనే అనేక సాంఘిక సమస్యల గురించిన వ్యాసముల ప్రచురించిన బాగుగా నుండును.

కు. ఉషా హేమచందర్ (హైదరాబాదు)

## అందానికి ఆరోగ్యానికీ...

నిమ్మపండు ఉపయోగాలు చెప్పిన విశాఖగారు మా వనితలకు ఎంతో మేలు చేసినారు గాని యీ వ్యాసం వారు యింకా కొంచెం ముందుగా రాసిన బాగుండేది.

శ్రీమతి జనార్దన్ (గవిడి)

## బొంబాయిలో....

28—6—63 ఆంధ్రవారపత్రిక వనితాలోకం లోని "బొంబాయిలో పొరుగు పిల్లలతో పాట్లు" అను సత్యభామగారి వ్యాసం చాలా అసమంజసముగా ఉన్నదని చెప్పుటకు బాధగానే ఉన్నది.

సత్యభామగారు కష్టపడి ఎం. ఏ. డిగ్రీ సంపాదించినారే గాని, ఆ డిగ్రీ చదువుకు తగని ఈర్ష్యా భావక ప్రసంగం చేశారు.

చదువుకు తోడు విజ్ఞానం, కొంత లోకానుభవం అవసరం.

అటవర్తి బాలసుభద్ర (బొంబాయి) ★

"ఓకే! ఇష్టంలేని ఈ చాకిరీని వదిలించుకునే మార్గమేదో నీవే చెప్పాలి!" అన్నాడు కృష్ణారావు మిత్రుడు కుమార్ భుజం పట్టుకుని వూపుతూ.

సిగరెట్టు ధూమకృత వైకుంఠ సీమలనుండి భూమికి తరలివచ్చినవాడై "ఏమిటి విషయం ?" అని తాపీగా ప్రశ్నించాడు మిత్రుణ్ణి కుమార్.



"నా ఉద్యోగం వదిలించుకునే మార్గమేదో నీవే చూపాలి !" అన్నాడు కృష్ణారావు కుర్చీలో కూలబడుతూ.

"నీ ఉద్యోగమా ? వదిలించుకునే మార్గమా?" అని ప్రశ్నించాడు కుమార్ ఆర్తత్రాణ పరాయణుడి పోజులో.

"సరిగ్గా చెప్పావు. అదే నేనడిగేది ! !" అన్నాడు కృష్ణారావు

కుమార్ కాసేపు ఆలోచించి, "అది సాధ్యం కాదు. పైగా మీ నాన్న బలవంతాన దీన్ని నీ మెడకు తగిలించాడుకదా ! ఇది తప్పించుకోవడం అసాధ్యం" అని స్పష్టంగా చెప్పేశాడు.

"అలాగంటే ఎలారా ? ఇవే కాళ్లనుకో !" అని మిత్రుడి చేతుల్ని పట్టుకున్నాడు.

"ఓరే ! మాటలు జాగ్రత్తగా రానీయ్ ! నా కాళ్లు చేతులయితే నేను జంతువుని కావాల్సిందే ! నన్ను జంతువుని చేస్తావా ?" అని కోపంతో మండిపొయ్యాడు కుమార్.

ఆరంభంలోనే పాఠక మహాశయుల్ని ఎక్కువసేపు 'సస్పెన్సు'లో ఉంచడం కథాకథన లక్షణాలకు విరుద్ధం కాబట్టి ఇక్కడ పై సంభాషణకు వెనుకగల గాథనంతా వివరిస్తాను.

ఫలానా వూళ్లో ఓ రంగనాథంగారుండండలో ఏవీ అసహజంలేదు. వారికి కృష్ణారావనే ముద్దుల కొడుకుండడంలోనూ ఏ అవాస్తవికతాలేదు. సదరు ముద్దుల కొడుకు కృష్ణారావు పాఠశాల చదువుల ముగించినవాడై ఎట్టకేలకు కళాశాలన్ జొచ్చి వరసగా విశ్వవిద్యాలయం వారికి రాజపోషకుడిగా ఉంటూ కలకాల మిలానే కాలం గడుపుదామని నిశ్చయించుకొన బోయేసరికి, విశ్వవిద్యాలయం వారా సంగతిని పసిగట్టేసి, ఆపటాన తామే వోడిపోయామని తెల్ల జండా ఎత్తేసి, సంధి చిహ్నంగా మన కృష్ణారావుని థర్డ్ తరగతిలో ఉత్తీర్ణుణ్ణి చేసి పారేశారు. ఇదంతా తన పరాక్రమమేనని మోర విరుచుకుని వీధుల్లో చక్కర్లు కొడుతున్న కృష్ణారావుకి నాన్న రంగనాథంగారు "వెంటనే ఉద్యోగం చూసుకోమని" 'అల్టిమేటమ్' అందించారు. "లేకపోతే నాకు తోచినదాంట్లో నిన్ను పడేయ్యాల్సి ఉంటుంది" అని కూడా హెచ్చరించారు. సంసార పక్షం వారు గాబట్టి రంగనాథంగారలా అనడంలో తప్పేమీ లేదు. కాని ఎంతోకాలం సజావుగా, తిరుబాటుగా కాలంగడిపిన కృష్ణారావుకి దొక పెద్ద భారంగానే కనిపించింది. నియమితమైన కాలంలో నిర్దిష్టమైన పద్ధతిలో ఒకరి ఆధీనంలో మరొకరి కార్యం నెరవేర్చడం అనేది బానిసత్వానికి పరాకాష్టగా అతడికి తోచింది. అతడి నిర్లిప్తత చూసి రంగనాథంగారో రోజుదయానే కృష్ణారావుని పిలిచి "ఈ రోజు పది గంటలకి ఫలానా ఆఫీసుకెళ్లి మేనేజరు జోగయ్య శర్మగారిని కలుసుకో"అని ఫర్మానా జారీ చేశారు.

"ఎందుకు ?" అని అడగలేదు కృష్ణారావు.

"లీవ్ వేకెన్సీ ఉందట. మూడునెలలు. తర్వాత కూడా మరెవరినైనా శెలవు పెట్టించి కొంతకాలం జరిగేట్టు చూస్తానన్నారు. జాగ్రత్తగా పని చేసుకుంటే ఏ గొడవా ఉండదు. ఇంతలో మంచి దానికి, పెర్మనెంటుదానికి గట్టి ప్రయత్నాలు చేయొచ్చు" అన్నారాయన తన మాటలకి తానే వ్యాఖ్య చెప్పుకుంటూ.

అపర శ్రీరామచంద్రుడనే కీర్తికోసం కాదుగాని, నాన్న మాటలకు ఝడిసి కృష్ణారావెళ్లి ఉద్యోగంలో ప్రవేశించాడు. ప్రవేశించాడే కాని అక్కడి కథ, కమామిషూ అన్నీ చూసేసరికి తన వంటే హాళే నిజమైనాయనిపించింది. ఈ వాతావరణంలో తానొక్కరోజైనా పనిచేయలేననిపించింది. వో వారం రోజులు పనిచేసి ఏమేనా సహాయం జేస్తాడనే ఉద్దేశ్యంతో కోక్లార్కు కుమార్ దగ్గరికి పరుగెత్తాడు.

"ఏమీ లాభంలేదు. ఇలాంటి సలహాలు నన్నడగొద్దు. మీ నాన్నగ్గాని ఈ విషయం తెలిసిందంటే నా ఉనికికే భంగం. మేనేజరుకీ, మీ నాన్నకీ మంచి జోస్తీ ఉందికదా !" అని నిక్కచ్చిగా చెప్పేశాడు కుమార్.

ఎండమావులను ఆశించి పరిగెత్తిన అరబ్బులాగా నిరాశ చెందాడు కృష్ణారావు. అయినా ప్రయత్నించి తానీ వాతావరణంలో సర్దుకోగలడేమోనని నెల్లాళ్లు చూశాడు. ఎంత ప్రయత్నించినా తనకిక్కడ సరిపోదని తెలీడంతో, తానే ఈ ఉద్యోగం వదిలించుకోడానికి ఉపాయాలు వెతకాలనుకున్నాడు. ఆలోచించగా, ఆలోచించగా అతడికో వూహా తట్టిందికూడా. వూహ తట్టడమేవిటి వెంటనే దాన్ని అమలు పర్చాలనుకున్నాడు.

మరుసటిరోజే ఆఫీసుకొచ్చి కాసేపు ఫైళ్లటూ ఇటూ కలగా పులగం చేశాడు. మధ్యాహ్నం టిఫిన్ టయిం మవుతుండనగా పై అధికారికి వెళ్లాల్సిన వో ఫైలు తీసి 'డ్రాఫ్టు' రాయడానికి బదులు వో తెల్లకాయితమ్మీద రెండు బొమ్మలు వేశాడు అంటే అతడేదో పెద్ద చిత్రకారుడనికాదు. కోతి బొమ్మ, పిల్లిబొమ్మ వేయలేనివారు ఎవరుంటారు? ఆ రెండు బొమ్మలూ చూసి అధికారి గుగ్గిలమై పోతాడు. కాలింగ్‌బెల్ వెంటనే కోపంగా "రింగ్" మంటుంది.

"సార్ ?" ప్యూను ప్రశ్న.

"ఆ కృష్ణారావు నిలా పిలు !"

కృష్ణారావు హాజరు.

"ఇదేమిటయ్యా నువ్వు రాసే డ్రాఫ్ట్ ? నువ్వీ ఉద్యోగానికి సరిపోవు. గెటవుట్ !" అంటాడు అధికారి.

కాలరెత్తుకుని విజయగర్వంతో అధికారి గదిలోంచి బయటికి రావచ్చు ననుకున్నాడు కృష్ణారావు.

జాగ్రత్తగా బొమ్మల్ని వేసి, అందం కోసం అక్కడక్కడా షేడింగు కూడా యిచ్చి ఫైలును ఎవరూ చూడకుండా జాగ్రత్తగా మడిచి, ప్యూన్‌ని పిలిచి "తాతబ్బాయి ! ఇది పెద్దయ్యగారి అప్రూవల్‌కు" అని చెప్పి, ఫైలు అందించి టిఫిన్ తీసుకుందామని కాంటీన్‌కు నడిచాడు.

ఫలహారం తీసుకొచ్చి సీట్లో కూలబడ్డాడు. ఇప్పుడో అప్పుడో పై ఆఫీసర్నుంచి పిలుపొస్తుందని తనకి బందిఖానా తప్పుతుంది. అనుకున్నాడు. ఆ భావన అతడిలో ఉత్సాహాతిరేకాన్ని కలిగించింది. "హాయి జీవితమే హాయిలే" అనే పాట హమ్మింగ్ చేసుకుంటూ ఫైళ్లు అటూ యిటూ సర్దేస్తున్నాడు. కాని మూడుగంట లయినా తానను కున్న పిలుపు రాకపోయేసరికి అతడి ఉత్సాహం జావ కారిపోయింది.

మూడున్నరకి ప్యూన్‌ని పిలిచి "మధ్యాహ్నం యిచ్చిన ఫైలు అప్రూవయిందా ?" అనడిగాడు. ప్యూను ఫైలు తీసుకొచ్చి సీట్లో పడేశాడు. చూస్తే తను వేసిన బొమ్మలకాయితం లేదు. దాని స్థానే శుభ్రంగా వ్రాసిన డ్రాఫ్టు ఉంది. నీటుగా అధికారి సంతకం తనని వెక్కిరించినట్లనిపించింది.

ఇదంతా తన కోక్లార్కు కుమార్ పనేనని కృష్ణారావు పసిగట్టేశాడు. కొట్టొచ్చినట్టు బొమ్మ లేసినందుకు యీ ఫైలు వాడి కళ్లబడి ఉంటుంది. "సరే ! ఈసారి చూస్తా !! వీడు నన్నెలా రక్షిస్తాడో !" అనుకున్నాడు. మరుసటి రోజు పై ఆఫీసరు కెళ్లాల్సిన ఫైలు అంతా తప్పుల తడకగా రాసేశాడు. ఫైల్లో ఒకలా ఉంటే డ్రాఫ్టులో మరోలా రాశాడు. అందం కోసం అక్కడక్కడా స్పెల్లింగు మిస్టేకులూ, వ్యాకరణ దోషాలూ ఉటంకించాడు. ఎక్కువ తప్పులున్న చోట అండర్‌లైను కూడా చేశాడు. ఆఫీసరెక్కడ సరిగా చూడకుండా సంతకం పెట్టేస్తాడేమో నని ఈ జాగ్రత్తలన్నీ తీసుకున్నాడు. "ఈసారి వార్నింగన్నా తప్పదు" అనుకున్నాడు. వార్నింగంటే అర్థం ఈ సారి ఖాళీ వస్తే దాంట్లో వేసుకోరన్నమాట. "అదీ ఒకందుకు మంచిదే" ననుకున్నాడు.

సాయంత్రం అయిదయింది. ఒక్కొక్కరే పనులు ముగించుకుని సీట్లు ఖాళీచేసి ఇళ్లకు జారుకుంటున్నారు. కృష్ణారావు ఫైళ్లు అటూ ఇటూ సర్దుతున్నాడు. "ఆఫీసరు మంచివాళ్లా ఉన్నాడు గుమాస్తా లందరూ ఉండగా తిట్టడ మెందుకని అందరూ వెళ్లాక పిలిచి చీవాట్లేస్తాడేమో !" అనుకొని అలాగే తన స్థలంలో కూర్చుండిపోయాడు. పిలిచి "చూడబ్బాయ్ ! నువ్వీ ఉద్యోగానికి పనికిరావు. మరోటి చూసుకో !" అంటాడు. తాను అలాగేనని ధైర్యంగా వచ్చేస్తాడు. ఈ సారి ఖాళీ వస్తే తనని వేసుకోరు. అదీ ధైర్యం.

అయిదున్నరయినా పిలుపు రాలేదు ప్యూన్‌ని పిలిచి ఫైలు తీసుకు రమ్మంటే తీసుకొచ్చాడు. దాన్ని చూస్తే మామూలే. యథాప్రకారంగా తన నోట్ స్థానంలో కుమార్ అక్షరాలతో పరిశుభ్రముగా రాసిన నోట్ ఉంది. అధికారి సంతకం కూడా అయింది.

"నిజం చెప్పు, తాతబ్బాయి ! ఇది నేరుగా అయ్యగారి దగ్గరికి తీసుకెళ్లావా ?" అనడిగాడు కృష్ణారావు ప్యూన్‌ని.

"నిన్న కుమార్‌గారు మీ ఫైలు చూశారండీ! అప్పుడే ఆయనకి చూపకుండా మీ ఫైళ్లు అయ్యగారి దగ్గరకి తీసికెళ్లొద్దని చెప్పారండి ! అందుకే మీ ఫైలు ముందాయన దగ్గరకే తీసికెళ్లాను."

"హోహో ! ఇదీ సంగతన్నమాట ! నేనూహించానులే ! !" అనుకున్నాడు కృష్ణారావు. అయినా ఈ కుమార్‌గాడెలా దొరికాడు తన ప్రాణానికి విలన్‌లాగ్గా. ఢడామడా వాణ్ణి తిట్టేద్దా మనుకుని చూసేసరికి వాడప్పుడే ఇంటికి వెళ్లిపోయాడు. సరే ఈ సంగతి వాడింటి దగ్గరే తేల్చుకుందామని సిటీ బస్సెక్కాడు.

కోపంతో బస్సెక్కిన కృష్ణారావు కోపంగానే మృదువైన వో కాలిని తొక్కేశాడు. కనీసం "సారీ"

37వ పేజి చూడండి




### జరిగిన కథ

కర్నల్ థామస్‌నెవిల్, తన కుమార్తె లిడియాతో ఇటలీ యాత్రానంతరం ఫ్రాన్స్ వస్తాడు. లిడియా సాహసం గల యువతి. చిత్రలేఖనం తెలుసు. 'కార్సికా' ఫ్రాన్సు ఇటలీల దరిని గల ద్వీపం. అక్కడికి వెళ్లడం కష్టనష్టాలతో కూడిన పని అయినా లిడియా, నెవిల్‌లు నావ కాప్టెన్ మాటతో ప్రయాణ మవుతారు. కార్సికాకు బయలుదేరారు. వారితో లెఫ్టినెంట్ "ఆర్సొరెల్లొ రెబ్బియా" అనే కార్సికను కూడా వచ్చాడు. కర్నల్‌కి రానురాను యూ రెబ్బియాతో పరిచయం పెరుగుతోంది. మూడు రోజుల ప్రయాణం తర్వాత వారి నౌక అజాచ్చియో గల్ఫ్ సమీపించింది. వారు కార్సికా చేరారు.

## 4

నెపోలియన్ జన్మించిన ఇల్లు సందర్శించారు; తక్కిన వింతలు చూస్తూ రెండు రోజులు గడిపారు కాని, మిస్ లిడియాకి కార్సికా అంటే విసుగు పుట్టడం ప్రారంభించింది. అక్కడి ప్రజలు తమని పూర్తిగా నిర్లక్ష్యం చేస్తున్నారని చింతించింది. అవసరపడి ఇక్కడికి వచ్చినందుకు పశ్చాత్తాప పడింది. కాని తను సాహస యాత్ర ఏదో చేసిన కీర్తి రావాలనే ఉబలాటమూ ఉంది. అందుచేత చిత్ర లేఖనంలో కాలం గడుపుదామని నిశ్చయించుకుంది. నిశ్చయించుకుని రంగులు, సుద్దలు సిద్ధం చేసి కొన్ని చిత్రాలు తయారు చేసింది. వాటిలో గుమ్మడి కాయలు అమ్ముతున్న కృషీవలుడిది ఒకటి. ఇతను చూడటానికి యూరోప్‌లో వ్యవసాయవృత్తి చేసుకునే వారి లాగే ఉన్నప్పటికీ, తెల్లని గడ్డంతో, అతి పౌరుషంగా కనిపించాడు. ఈ వినోదాలతో విసిగిన తర్వాత ఆమె 'కార్పోరల్' వంశీయుడి విషయం గమనించటం ప్రారంభించింది. నిజం చెప్పాలంటే ఆర్సో సహకారం వెంటనే లభించింది. తన ఊరికి వెళ్ళిపోదామనే అదుర్దా చూపించలేదు సరికదా, అజాచ్చియో లోనే ఉండటానికి అయిష్టపడినట్లు లేనేలేదు. అదీకాక, మిస్ లిడియా ఒక మహాత్కార్యం తలపెట్టింది - ఇక్కడ పర్వత ప్రజలని సంస్కరించటం, వారు తమ భయంకర మయిన అలవాట్లను వదులుకునేట్లు చెయ్యటం, ఈ దుడుకు స్వభావం గల యువకుడిని

నాశనం కాకుండా రక్షించి మంచి మార్గంలో పెట్టడం ఎంత గొప్ప పని!...

మన యాత్రికుల దిన చర్యల క్రమం ఇది. ఉదయం కర్నల్ గారు, ఆరో్న వేటకి పోయేవారు; మిస్ లిడియా బొమ్మలు గీసేది, లేక తన మిత్ర వర్గానికి ఉత్తరాలు రాసేది— అజాచ్చియో నుంచి ఉత్తరాలు రాయటం అంటే సామాన్యం కాదు; ఆరు కావస్తోందనగా మగవారిద్దరూ కావలసినంత 'మృగసమృద్ధి'తో తిరిగి వచ్చేవారు; సాయంకాలం భోజనం ముగించిన తర్వాత మిస్ లిడియా పాడేది; కర్నల్ గారు నిద్ర పోయేవారు; మిగిలిన వారు ఇద్దరూ కబుర్లు చెప్పుకునేవారు.

ఏదో 'పాస్-పోర్ట్' (Passe-Port) విషయమయి కర్నల్ గారు అక్కడ అధికారి ఒకాయనని సందర్శించవలసివచ్చింది. పూర్తి వివరాలు నాకు తెలియవు. ఎంత సేపూ తన ఊరివారితోనే కాలక్షేపం చేసి, చేసి విసిగిన ఈయన బ్రిటన్ నుంచి పెద్ద మనిషి ఎవరో వచ్చాడని తెలిసి సంతోషించాడు. తన చేత వీలయినది అంతా చేస్తానన్నాడు. కొన్ని రోజుల తర్వాత తనే కర్నల్ గారిని చూడటానికి వెళ్లాడు అప్పటికే ఆయన సోఫా మీద ఒరిగి నిద్రపోవటానికి సిద్ధంగా ఉన్నాడు. ఆయన కూతురు ఒక పాడయి పోయిన పియానో ముందు కూర్చుని, వాయిస్తూ పాడుతోంది. ఆరో్స పియానోకి అవతల నుంచుని ఆమె పాడే పాటస్వరాలు రాసి ఉన్న పుస్తకం పేజీలు తిప్పుతూ ఆమె తెల్లని భుజాలని, బంగారు రంగు జుట్టునీ చూస్తున్నాడు. అధికారి రాగానే సంగీతం ఆగిపోయింది. కర్నల్ గారు లేచి నుంచుని, కళ్ళు నులుముకుని, తన కుమార్తెని పరిచయం చేశాడు. "దెల్లారెబ్బియాని పరిచయం చెయ్యటం అనవసరం అనుకుంటాను," అన్నాడు. "అతనెవరో మీకు తెలియకుండా ఉంటుందా?"

"ఈయన కర్నల్ దెల్లా రెబ్బియా కుమారుడేనా?" అని అడిగాడు అధికారి కొంచెం సంకోచిస్తూ.

"అవునండీ," అన్నాడు ఆరో్స.

"మీ తండ్రి గారు నాకు తెలుసులెండి."

ఆ తర్వాత సంభాషణ సరిగ్గా నడవలేదు. ఎంత అవుకుందామని ప్రయత్నించినా కర్నల్ గారికి ఆవ

—35 వ పేజీ చూడండి

వివిధ ప్రాంతాల వింతలు 16

# టాంగనీకా

ఇటీవల టాంగనీకాలో ఓ పెద్ద పథకం ప్రారంభించారు. అదీ వేటకు ప్రాజక్టుట. వేటంటే మామూలుగా తూటాలు, తుపాకుల తోటి గాని, కేమేరాలు పట్టుకు చేసే ఫోటోల వేటగానీ కాదు. ఇదో కొత్తరకం. 34000 చదరపుమైళ్ళల్లో, భూగర్భాల్లో దాగివున్న అపూర్వ ఖనిజ సముదాయాన్ని వెలికిదీసి దాన్ని దేశాభ్యుదయానికి ఉపయోగిస్తారు. కనుక ఇది ఖనిజాల, గనుల వేటన్న మాట. ఇటీవల అంటే ఏ కొద్దినెల్ల క్రిందటో అనుకునేరు! సుమారు 6 ఏళ్ళ క్రిందట. ఇప్పుడు



టాంగనికాలోని కిలిమింజారో శిఖరం.

టాంగనీకా స్వతంత్ర దేశం కూడా ఐపోయింది.

ఈ పని జరిగేదంతా అమెరికన్, బ్రిటిష్ పెట్టుబడులు, ఇంజనీర్లతోను. అలా అని అచ్చంగా విదేశీయమూ కాదు. చాలామంది ఆఫ్రికన్ సాంకేతికుల సహాయంకూడా ఉంది.

టాంగనికాలో ఇలాంటి పని చేయటమంటే సులభంకాదు. అతి భయంకరమైన వాతావరణం, దుర్గమ ప్రదేశాలు, క్రూరమృగాలకు కూడలి. ఇలాంటి దాంటో జరిగేపని మాటతో జరగదు. అందుకే ఎత్తునుంచి కొలిచి ప్లానువేసేందుకు వీలుగా ఎలక్ట్రానిక్ యంత్రాలు, కెమెరాలతో ఉన్న విమానాలు ఉపయోగించారు. అసలైన పని ప్రారంభమైనప్పుడు ఫలాని ప్రదేశంలో పని జరుగుతోందని తెలియపర్చేందుకు రేడియోలు ఉపయోగించారు.

ఈ కార్యక్రమానికంతటికి కేంద్రం ఘున్యా. ఇది రొడీషియా సరిహద్దులో ఉంది. ఒకప్పుడు ఇది బంగారు గనులకు నిలయంగా, పేరెక్కిన పట్నంగా ఉండేది. 1922—36 మధ్య ఈ నగరం అనుభవించిన వైభవం చెప్పతరంకాదు. అంతటి ప్రసిద్ధిగల ప్రాంతంలో 1957లో జరిగిన ఈ ఖనిజాన్వేషణం ప్రారంభమైందీ అంటే ఆ ప్రాంతానికి పునః ప్రాణప్రతిష్ఠ చేశారన్నమాట.

ఈ పథకం ప్రారంభం తక్కువ అంచనాతోటి జరిగిందిగాదు. బంగారంకన్నా ఎక్కువ విలువయిన, 'రేడియో ఏక్టివ్' ఖనిజాలవల్ల ఈ ప్రాంతం బంగారం పంటలే పండించవచ్చునే అంచనాలతోటే ప్రముఖులైన, అనుభవజ్ఞులైన సాంకేతికులు ఈ బృహత్పథకానికి పూనుకున్నారు.

ఈ 34000 చ. మైళ్ళ విస్తీర్ణంగల ఈ ప్రాజెక్టును ఓ చివర హద్దు 'యుజ్జీ' దీనికి దగ్గరలోనే టాంగనీకా సరస్సు ఉంది. ఇది సరాసరిగా, 450 మైళ్ళ పొడుగు, సగటుగా 30 — 45 మైళ్ళ వెడల్పు ఉంటుంది. ప్రపంచంలో అతిలోతైన సరోవరాల్లో ఇది రెండోదిట. ఈ సరస్సుకు ఓ ప్రక్క దేశం కాంగో.

ఇప్పుడు చెప్పిన 'ఉజ్జీ' ప్రాంతంలో ముఖ్యమైన వృత్తి చేపల వేట. ఇక్కడ దాగా అనే ఓ రకమైన చేపలు దొరుకుతాయి.

ఈ పట్నానికి ఓ ఐదు మైళ్ళ దూరంలోనే ఉంది. 'కిగోమా' అనే తీరప్రదేశం. ఇదీ కేవలం రైలు మార్గాలకు కేంద్రమేగాక మంచి తీర ప్రదేశాల్లో నొకటికూడా.

—టెంపిల్ మానింగ్ ★

"నో మిస్టర్ ... ఏ వర్కి కూడా నాలుగు గంటలకే వెళ్ళామంటే ఎలా మిస్టర్."

ఆ సమాధానంతో చలపతికి సహనం చచ్చిపోయింది. అసహనంతో ఆకాశమంత పెరిగాడు. అతిశయంతో అధికార యుతంగా ఆఫీసర్ చిన్నగా నవ్వి తిరిగి అన్నాడు.

"క్రమశిక్షణా రహితంగా ప్రవర్తించడం నా కిష్టంలేదు మిస్టర్ చలపతి, అందులో ఈ రోజు ఆ 'డి వన్' కూడా రాలేదు—"

"అవుననుకోండి కాని మా పరిస్థితులు—" అంటూ నసిగాడు చలపతి.

"నీ పరిస్థితులు నువ్వు చూసుకుంటే ఏం లాభం? వాట్ ఎబౌట్ మీ? ఆ డైరక్టర్‌కు వెళ్ళవలసిన స్టేట్‌మెంట్స్ ఇంతవరకు పంపలేదు. ఇప్పుడంతా పెండింగ్‌లో ఉంది.. ఎవరికి వారు వెళ్తామంటే ఎలా మిస్టర్?" ఆఫీసర్‌గారి కంఠంలో కాఠిన్యం ప్రతిధ్వనించింది.

"నా సీట్లో ఏ పని పెండింగ్‌లో లేదండి —" అన్నాడు ధైర్యంచేసి.. ఆఫీసర్ ముఖం చిట్లించాడు. ఆయన మొహంమీద రంగులు మారాయి.




"ఏమిటి నువ్వనేది!" అంటూ ఒకసారి కళ్ళజోడు సవరించుకుని "సభ్యత తెలిసి మసలుకో మిస్టర్ చలపతి. నాకు నువ్వు డిక్టేట్ చెయ్యడానికి రాలేదు.... గుర్తుంచుకో...."

"అదికాదు సార్" అన్నాడు చలపతి ఆయన మాటలకు అడ్డువస్తూ.

"ముందు నీ సీట్లోకిపోయి పని చూసుకో మిస్టర్ చలపతి.... ఆ.. ఆ డి వన్ సీట్, పెండింగ్ కరంట్స్ కు లిస్టులు తయారు చెయ్యి..."

"సార్"

"నో వెళ్ళండి...."

"........"

"నో..నో.. నేను వెళ్ళమని చెప్పాను" అన్నాడ ఆఫీసర్ విసుగ్గా.

స్ప్రింగ్ డోర్సు తోసుకొని బయట పడ్డాడు చలపతి. అప్పటివరకు ఆఫీసర్ గదిలో జరుగుతున్న సంఘటనను అంజనంవేసి చూస్తున్న గుమాస్తా రాయుళ్ళందరు చలపతి రాకతో బుద్ధిమంతుల్లా వాళ్ళ పనుల్లోనిమగ్నులై పోయారు.

నిశబ్దంగా తన సీట్లో కూర్చున్నాడు చలపతి.

"ఏం గురూ.... ఏమంటున్నాడు మన వాడు.." అన్నాడు వ్యంగ్యంగా శర్మ. ఆఫీసంతా గుసగుసలు.. వెక్కిరింపులు....

సంఘం చాలా విచిత్రమైనది. బాధితులను మరింత బాధిస్తుంది. "చలపతీ.... నీ పరపతి గతి తప్పే" అంటూ అందుకున్నాడు సి. సి. శర్మ చలపతికి ఏడ్పుతో, లేక ధైర్యంతో ఆ పరిస్థితులను ఎదుర్కోవాలో పాలుపోలేదు. మానవుడిలో ద్వేషం, మాత్సర్యం, కసిత్వం, దాగి ఉన్నాయని మాత్రం తెలుసుకున్నాడు.

ఆఫీసులో పనిచేసే వాళ్ళందరిలోను బాగా వర్క్ చేసేది తానొక్కడే అని అందరికి తెలుసు. కాని తాను లౌక్యుడుగాడు. ఈ అసమర్థతను పురస్కరించుకుని ఆఫీసులో ప్రతి ఒక్కరు చిన్న చిన్న నేరాలను కూడా తనమీదకు సులభంగా నెట్టేస్తారు.

"మా బాబు వట్టి అమాయకుడు. వాడ్ని కాపాడగలవాడు ఆ భగవంతుడొక్కడే...." అంటూ రాధమ్మ గారు అనుకోవడం కద్దు. తల్లి మాటలు గుర్తుకు రాగానే అతని నేత్రాలు అశ్రుపూరితాలయినాయి. తోటి మనిషిని సానుభూతితో అర్థం చేసుకోలేని వాడు మానవుడు ? నవ నాగరికతకు ప్రతిబింబుడు.

చలపతిలో రక్తం ఉరకలు వేస్తున్నది. అతనిలో ఆలోచనా తరంగాలు ఉవ్వెత్తున లేస్తున్నాయి. ఒడ్డు కోసం ఉరకలు వేస్తున్నాయి. అతని అసమర్థతను ప్రతి చిన్న సంఘటన వెక్కిరిస్తున్నది. సాయంత్రం రైలుకు వెళ్తేగాని తనకు రేపు రాజమండ్రిలో కావలసిన పనికాదు. రేపు రాజమండ్రి వెళ్ళకపోతే అక్కయ్యకు పెళ్ళి కావడం కష్టం.... తాను వెళ్ళాలి.... వెళ్ళాలి.... పిడికిడి బిగించాడు చలపతి.

ఎప్పుడూ ఈ ఉద్యోగంలో సుఖం, శాంతి లేదు. మానసికంగా, శరీరకంగా బాధ పడుతూనే ఉన్నాడు. గట్టిగా స్వాతంత్ర్యంగా వూపిరి పీల్చుకుందామంటే తావు లేదు. ఈలాంటి ఉద్యోగం ఎందుకు, ఎవరికోసం ?

ముందు అక్కయ్యకు పెళ్ళి కావాలి. రాజమండ్రి వెళ్ళి వాళ్ళతో మాట్లాడి రావాలి. క్రిందటివారం పర్మిషన్ దొరకలేదు. చివరికి సెలవుకూడా దొరకలేదు. ఈ వారం అంతే అయింది. వచ్చే వారంలో మాత్రం సెలవు దొరుకుతుందని నమ్మకం ఏమిటి? అతనిలో ఉడుకు రక్తం నురగలు గ్రక్కింది.

శరీరమంతా చెమట పట్టింది. ఆలోచనా శూన్యుడై పోయాడు. సమయా సమయాలను యోచించే శక్తిని కోల్పోయాడు.

మనస్సు మొద్దుబారి పోయింది. ఆత్మ వంచన చేసుకోలేకపోయాడు. గుండె వడివడిగా కొట్టుకుంటున్నది.....

పావుతావు కాగితంపై నాలుగు లైన్లు బరికాడు.

త్వర త్వరగా సూపరింటెండెంట్ సీట్ దగ్గరకు వచ్చాడు. ఆయన అక్కడలేడు. వణికే చేత్తుతో ఆ కాగితాన్ని పట్టుకొని అదిరే పెదిమలతో చదవసాగాడు. మళ్ళీ చదివాడు.... రెండు.... మూడు....

సూపరింటెండెంట్ రాలేదు. గడియారం తన పని తాను చేసుకుంటూ పోతున్నది. చివరికి చలపతి ఆ కాగితాల్ని బల్ల మీద పేపర్ వైట్ క్రింద పెట్టాడు. జేబు రుమాలుతో మొహాన్ని తుడుచుకున్నాడు. అతని హృదయం ఇప్పుడు తేలికై పోయింది. గబగబ ఎవరిని గమనించకుండా ఆఫీస్ నుండి బయటపడ్డాడు. బయటకు వచ్చాడే గాని లోపల అంతా భయం. ఇంటికి వెళ్ళలేక పోయాడు.

* * *

చలపతి తల తిరిగి పోతున్నది. అప్పటివరకు ఇంటికి వెళ్ళాలని ఎంత ఆతృత పడుతున్నాడో ఇప్పుడు అంత ఆలస్యం చేస్తున్నాడు. ఏదో తెలియని బాధ, భయం గుండెల్లో సుడులు తిరుగుతూంది. ఒక పావుతావు కాగితంతో ఆఫీస్‌కు తనకు బంధాలు త్రెంపుకున్నాడు. బానిస బ్రతుకుకు స్వస్తి పలికాడు. బాధా హృదయుడు చలపతి.

చిన్నతనంలో తండ్రిని పోగొట్టుకున్నాడు. అతని జీవితపు వీణ ఆది లోనే అపశ్రుతి పలికింది.

"దౌర్భాగ్యుడు" అంటూ దూషించాడు అన్న—

"నా బాబూ" అంటూ హృదయానికి హత్తుకొని సాకింది అమ్మ. తాను పెరిగాడు.

అన్నయ్యకు పెళ్ళి అయింది. వాడి దోవ వాడు చూసుకున్నాడు.

అక్కయ్య పెద్దదయింది.

ఉన్నకొద్దిపాటి ఆస్తిలో భాగాలు ఏర్పరిచింది వదిన.

తాను, అక్కయ్య, అమ్మ మిగిలిపోయారు..

అక్కయ్యకు పెళ్ళికావాలి. అన్నయ్య పట్టించుకోడు. అందుకు అమ్మ తనని రాజమండ్రి వెళ్ళి రమ్మంది.

మొహానికి పట్టిన చెమటను తుడుచుకున్నాడు చలపతి. చదువుకునే రోజులలో ఎన్ని కలలు కన్నాడు ? ఆ తరువాత ఈ ప్రపంచంలో ఒక స్థానం సంపాదించుకోడానికి ఎంత కష్టపడ్డాడు. ఆశయాలు, ఆశలు, అనుభవంలో అందనివై పోయాయి.

మామయ్యకు ముందరనుండి తానంటే అభిమానం కాని అత్తయ్యకు, రాణిని ఒక పెద్దింటి అబ్బాయికి ఇవ్వాలని ఉబలాటం. రాణికి తానంటే ప్రేమ. చిన్నప్పటి నుండి కలిసి మెలిసి తిరిగారు.

తనకు ఉద్యోగం దొరకనంతవరకు అందరు ఈసడించారు. ఉద్యోగం దొరకగానే అందరు గౌరవించారు.

కాని ఇప్పుడు.. చలపతి గుండెలు వడి, వడిగా కొట్టుకుంటున్నాయి భవిష్యత్ గురించి ఊహించలేక పోతున్నాడు. అతడు ఊహించిన ఊహా చిత్రం భగ్నమై పోయింది. కటువైన సంఘటనల మధ్య అతని జీవితం నలిగిపోతున్నది.

"తాను నిరుద్యోగి.... ఇక ప్రతినెల తొంభై ఆరు రూపాయలు రావు.... రేపు ఎంత భయంకరమైనది...." భయంతో వణికి పోతున్నాడు చలపతి.

ఆకస్మికంగా భుజంపై ఏర్పడిన కర స్పర్శకు ఉలిక్కిపడ్డాడు చలపతి. మాధవయ్య గార్ని చూసి మౌనంగా ఊరుకున్నాడు.

"అదేమిట్రో అప్పుడే ఆఫీస్‌నుండి బయట పడ్డావు—"

"......" ఏం చెప్పాలో పాలుపోలేదు చలపతికి.

"అదిసరే.... ఈ రోజు రాజమండ్రి పోతానన్నావు...."

అంటూ తన మామూలు ధోరణిలో మాట్లాడసాగారు.

"లేకపోతే ఆ సంబంధం వదులుకున్నారా ?.... నా మాటవిని ఆ విజయవాడ సంబంధం సెటిల్ చేసుకోండి....మీ అక్కయ్య బాగా సుఖ పడుతుంది." అంటూ ఉచిత సలహా ఇచ్చారు.

చలపతి మౌనంగా వింటున్నాడు.

"ఏరా ఒంట్లో బాగుండలేదా ?.." కళ్ళజోడు సవరించుకున్నారు

"ఈ మధ్యన మా ఇంటికి రావడం మానేశావే.. ఆఫీసుపని రద్దిగా ఉందా ?.... మీ అత్తయ్య నీకోసం. రెండు మూడు రోజులనుంచి పలవరిస్తోంది. ఊ.... ఏమిటి మూగనోము పట్టావు...." తాను నిరుద్యోగి అని తెలిస్తే మామయ్య ఇంత ఆదరిస్తాడా ? చూసి చూడనట్లు తొలగిపోయేవాడు....

"ఏమిటి అలా ఉన్నావు.... కాఫీ తాగుదాం రా" అంటూ బలవంతం చేశాడు.

"ఇప్పుడు వద్దులే మామయ్యా" అన్నాడు చలపతి అనాలోచితంగా కాని వెళ్ళక తప్పలేదు.

* * *

ఆరోజు రాత్రి నిద్రపట్టలేదు చలపతికి. అనేక రకాల ఆలోచనలు అతని మస్తిష్కంలో కదలుతున్నాయి.

తానింతవరకు ఒక పయాపైసా కూడా ఆదా చెయ్యలేదు. అప్పటివరకు చాలీ చాలని జీతపు రాళ్ళతో జీవితం గడిచి పోయింది. ఉన్న కొద్దిపాటి ఆస్తి అక్కయ్య పెళ్ళికోసం పదిల పరిచాడు.

తనకు త్వరలో ఇంకో ఉద్యోగం దొరకక పోతే.... ఇంటి ఖర్చులకు డబ్బు.... ఎక్కడనుండి తేవాలి ? ఆలోచనలు తెగడంలేదు. లేచి కూర్చున్నాడు చలపతి.

అప్పటివరకు కొడుకు ప్రవర్తనను గమనిస్తున్న రాధమ్మగారు కూడా లేచి కూర్చుంది.

"ఏం బాబూ.. నిద్రపట్టడం లేదా ?.... అన్నం కూడా సరిగా తినలేదు.... ఎందుకంత మథన పడుతున్నావు బాబూ—"

"ఏం లేదమ్మా" అన్నాడు నిర్లిప్తంగా చలపతి.

"పిచ్చాడా అక్కయ్య కోసం దిగులు పడుతున్నావా ? ఈ వారం కాకపోతే ఇంకో వారం పోదుగాని...."

"అది కాదమ్మా" అన్నాడు ఉదాసీనంగా

"ఏదో భగవంతుడు మనకో దోవ చూపించాడు. నీకో ఉద్యోగం వేయించాడు. దానికి పెళ్ళి చేయక పోతాడా?.... నాకు తెలుసు బాబూ.... భగవంతుడు దయా మయుడు....తప్పక రాజమండ్రి సంబంధం సెటిల్ అవుతుంది...." ఆమె కళ్ళు చెమర్చాయి.

"అమ్మా పడుకో అమ్మా.... నాకు నిద్ర వస్తోంది" అంటూ గట్టిగా కళ్ళు మూసుకొని పడుకున్నాడు చలపతి.

తానింతవరకు అమ్మకు నిజం చెప్పలేదు. చెప్పితే ఎంత బాధపడుతుందో.... తనకోసం ఎంతో కష్టపడింది. పడరాని బాధలను భరించింది.

తాను త్వరలో మంచి ఉద్యోగం సంపాదించాలి.. అమ్మను సుఖపెట్టాలి.. మంచి ఉద్యోగం రావాలి.. తన కష్టాలు గట్టెక్కాలి.. వ్యక్తిత్వం బయటపడాలి.... అనేక ఆలోచనలతో అలిసిపోయి నిద్రపోయాడు చలపతి.

* * *

"బాబూ ఈ రోజు ఆఫీస్‌కు సెలవా ?"

"ఆదివారం కదమ్మా.. సారి.. ఈ ఆదివారం సెలవమ్మా"

"ఏం.... ఆఫీసర్ క్యాంప్‌కు వెళ్ళారా ?"

"అవును" అన్నాడు చలపతి. సంభాషణ పెంచడం ఇష్టం లేదు.. లైబ్రరికి వెళ్ళి పేపర్లన్నీ తిరగవేశాడు. వాంటెడ్ కాలమ్స్ అన్నీ ఓపిగ్గా చూశాడు.

ఏదైన వస్తువును పోగొట్టుకోవడం సులభం. కాని దానిని తిరిగి పొందడం కష్టం.

కనబడిన ఇద్దరు, ముగ్గురు, స్నేహితుల్ని తప్పించుకుని తిరిగాడు. వాళ్ళకంట పడితే కష్టం. కాని ఒక మిత్రుడు పట్టుకున్నాడు.

33 వ పేజీ చూడండి




## 26-7-1963 శుక్రవారము మొదలు
## 1-8-1963 గురువారము వరకు

**దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి**

### గ్రహస్థితి

మిథునంలో రాహువు, మిథున కటాకాలలో శుక్రుడు, కర్కాటకంలో సూర్యుడు, కటక సింహాలలో బుధుడు, కన్యలో అంగారకుడు, ధనుస్సులో కేతువు, మకరంలో శని, మీనంలో గురువు, కన్య తుల వృశ్చిక ధనుస్సులలో చంద్రుడు.

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

బాహ్య పరిస్థితులు ఎలా ఉన్నా మనస్సును ఐదుటు పరుచుకొన గలరు. సాధారణంగా శత్రుబాధ కనిపించకపోదు. మంచితనం నిలుపుకొంటూ యుక్తితో మీ పనులను జరుపుకోగలరు. కుటుంబ విషయాలలో గౌరవ ప్రదమైన సమయం. అప్పుల దేహ బాధలు కాని, ఆర్థిక చిక్కులుకాని మీ మనో ధైర్యాన్ని కదలించగలవు. చేతిలో డబ్బు ఉన్న దంటే అక్కరలేని పనికూడా అవసరంగా తోస్తుంది. వ్యవహార రంగంలో "ఒక్క దెబ్బకు రెండు పిట్టలు" అన్నట్లు ముందుకు పోగలుగుతారు. విద్యా సంబంధమైన చర్చలు మొదలయిన వాటిలో చేరుతారు. మీ మాటలతీరు మిత్రుల మనస్సును నొప్పించకుండా చూడండి. సాహస కార్యాలలో చేరవద్దు.

*　*　*

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)

ఇతరుల ప్రశ్నలకు సమాధానం చెప్పటం కష్టం, మాటలు పెంచుకొంటూ పనులకు ఆలస్యం కలిగించుకోవద్దు. అధికారులవంటి వారితో అతి చనవు మంచిదికాదు. ఆదాయం మామూలుగానే ఉంటుంది. పిల్లల ఆరోగ్యాది విషయాలలో జాగ్రత్తగా ఉండండి. మీ డబ్బును వృధా వ్యయం చేయించగల సలహాలు తరచుగా రాగలవు. మీ క్రింది పనివారివల్ల కొంత అనుకూలత ఉంటుంది. ప్రయాణాలు ఈ సమయంలో అంత సుఖప్రదంగా జరుగవు. వారం రెండవ భాగంలో వృత్తిలో గౌరవ ప్రదమైన కాలం. మీరు చెప్పిన మాట జరుగుతుంది. 31, 1 తేదీలలో శుభ కార్యాలలో ఆటంకం, ధనలాభం.

*　*　*

### మిథునం :

(మృగశిర 3, 4 పా., ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఉత్సాహాన్ని తెచ్చి పెట్టుకోవలసిన సమయం. వృత్తి ఉద్యోగాలలో పరిస్థితులు ఆలోచనలకు, అనుమానాలకు దారి తీస్తవి. కుటుంబంలో సుఖం లోపించదు. కాని, మనస్సులో ఏదో ఒక విధమైన కొరత తోస్తుంది. వ్యవహార విషయాలలో అనవసరమైన శ్రమ కలుగుతుంది. అయితే పర్యవసానం లాభకరంగా ఉంటుంది. సంఘంలో గౌరవము, ఆదరము లభిస్తవి. వినోద విషయాలకై ఖర్చులు పెరుగుతవి. స్థానాస్థల మార్పులు, కొనటము మొదలయినవి నిదానంగా జరుగవలసిన పనులు. ప్రస్తుతం ముఖ్యంగా మీ ఆరోగ్యము జాగ్రత్తగా చూచుకొనండి. మాటలలో ఎదటివారికి మీ అసూయను తెలియనీయవద్దు. 26, 27లలో కార్యభారము, గౌరవం, శుభవార్తలు.

*　*　*

### కర్కాటకం :

(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష.)

దేనికైనా ముందుగా ప్లానులు వేయుటం మంచిది కాదు. ఆయా సమయానికి తగినట్లు కార్యక్రమం సాగించటం సులభం. నూటి మాటలతో మీ మనస్సును వికల పరచేవా రుంటారు. ఆదాయం బాగుంటుంది. వృత్తిలో ఎదటివారిని మంచి చేసుకో గలుగుతారు. ప్రతి వక్కరిని నమ్మవద్దు. ముందుగా ఆరంభించిన పనులు కొంత వరకు జరగకముందే క్రొత్త ఆలోచనలు వస్తూ ఉంటవి. బంధు మిత్రులలో కొందరు చాటుగా మిమ్ములను ఇబ్బంది పెట్టేవారుంటారు. ఈ సమయంలో దేనికైనా సిద్ధపడగల ధైర్యము, యోచనా లభిస్తవి. వారాంతంలో ఆదాయవృద్ధి లక్షణం కనుపిస్తుంది. భాగస్థులతో జాగ్రత్తగా ఉండండి. 30, 31 తేదీలలో ఉపయోగంలేని ఖర్చులు, శుభ వార్తలు.

*　*　*

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

కాలం కలసి వస్తుంది. మధ్యలో జరిగే పరీక్షలకు తట్టుకోగలుగుతారు. విరోధులు తమ స్థితిని తెలుసుకొని చల్లగా తప్పుకొంటారు. ఖర్చులు కనుపించినా ప్రయోజనం అనేది ఉంటుంది. ప్రయాణ సూచనలున్నవి. సమయంలో చక్కని యోచన, ఇతరులకు సహాయపడే శక్తి లభిస్తవి. వ్యవహార విషయాలలో ఆసక్తిని తగ్గించుకొనటం వల్ల సుఖం పొందగలుగుతారు. వృత్తిలో ఇంతకు ముందు ఎదురు చూడని గౌరవము, అభివృద్ధి కనుపిస్తవి. కుటుంబ విషయాలలో స్వల్ప లోపములు కనుపించకపోవు. వాటివల్ల అసంతృప్తి మాత్రం ఏర్పడదు. ఆదరణతో మాట్లాడగల స్నేహితులు లభిస్తారు. శ్రమకరమైన పనులను కూడా సుఖమైన మార్గంలో జరుపుకొన గలరు.

*　*　*

### ఈ వారము ధరలు

యాలకులు, కస్తూరి మొదలయిన సుగంధ వస్తువుల వెలలు పెరిగే అవకాశాలున్నవి. శిల్క్ వస్త్రాల ధర క్రమంగా పెరుగుతూ ఉంటుంది. ఇనుము ఇనుప వస్తువుల ధరలో పెరుగు దల సూచనలు వచ్చి తిరిగి మామూలుగానే నిలుస్తుంది. వేరుశనగ నూనె ధరకన్నా పప్పుకు గిరాకీ వస్తుంది. వారాంతంలో నూనెల ధర హెచ్చు.

### కన్య :

(ఉత్తర 2,3,4 పా., హస్త, చిత్త 1, 2 పా.)

గౌరవస్థితి బాగుంటుంది. స్నేహితులు మిమ్ములను మాటలతో ఉబ్బిస్తారు. ప్రతి చిన్న విషయంలోను పెద్దగా లాభించ గలదనే ఆశ కలుగుతు ఉంటుంది. మీ శ్రమ వృధాకాదు. కాని, చట్టా వ్యాపారం వంటి పనులలో ప్రవేశించ వద్దు. స్వవిషయంలో శ్రద్ధ వహించటం అవసరం. వ్యవహార రంగంలో పరిస్థితులు అనుకూలిస్తవి. ఆదాయం ఇంతకు ముందుకన్నా మేలుగా ఉంటుంది. ఇతరుల వద్ద డబ్బు ఇచ్చి పుచ్చుకొనే సందర్భాలలో పొరపాట్లు రాగల సమయం. బంధు మిత్రుల గురించి లోగడ కలిగిన అభిప్రాయాలను మార్చుకొంటారు. వృత్తిలో విరోధాలు తగ్గిపోతవి. అధికారులతో అనుకూలమైన స్థితి ఏర్పడుతుంది. 27, 28 తేదీలలో ఆదాయ వృద్ధి, కోపోద్రేకాలతో కూడిన ప్రసంగాలు.

*　*　*

### తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

మనస్సులో ఏదో ఒక ఇబ్బందిని గూర్చిన శంక వస్తూ ఉంటుంది. కావలసినంత వరకు ఆదాయము, సంఘంలో పలుకుబడి బాగుంటవి. వృత్తిలో మీ విధులను జాగ్రత్తగా జరుపుకొన గలరు. బంధు మిత్రులకు సహాయం చేయవలసి వస్తుంది. కాని, వారినుంచి ఆదరణ ఎంతమాత్రము లభించకపోవచ్చు. కుటుంబంలో అనారోగ్యాలవల్ల ఖర్చులు, మానసికంగా, ఆదుర్దా కలుగ గలవు. ముఖ్యంగా పెద్ద పనులు, అత్యవసరమైన వాటి నిమిత్తం మీరు చేస్తున్న ప్రయత్నం తెలియకుండా ఏర్పడే చిల్లర ఆటంకాలవల్ల నిలిచిపోతవి. కొన్ని విషయాలలో ఇతరుల సలహాపైననే ఆధారపడవలసి వస్తుంది. పిల్లల ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకొనండి. 28, 29 తేదీలలో ధర్మకార్యాలు, గౌరవం.

*　*　*

## వృశ్చికం:

(విశాఖ 4వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

క్రమంగా కాలం కలిసి వస్తుంది. ఎదురు చూస్తున్న అవకాశాలు లభిస్తవి. ధన విషయంలో మీరు ధారాళంగా ఉండటం వల్ల సులభంగా కార్యం జరుపుకొంటారు. ఆత్మీయుల సలహా వెంటనే లభించదు. ఆహార విహారాలలో లోపాలు, మార్పులు కలగటం వల్ల మానసిక, శారీరక స్థితులలో వ్యత్యాసం తెలుస్తుంది. పై అధికారులవల్ల మంచి మాట పొందగలరు. విలువగల వస్తువులు కొనే సందర్భాలలో కొంత దండగ కూడా ఉంటుంది. మీకు పూర్తిగా తెలియని పనులలో వెనుకను తగ్గి ఉండటమే అవసరం. వారాంతంలో ఒక పనిని గురించి రకరకాల యోచనలు చేస్తారు. వ్యాపార వ్యవహారాలలో ఇతరులు నిర్వహించు కార్య క్రమాలలో ప్రవేశించ వద్దు.

* * *

## ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

అనుకొనేది ఒకటి, జరిగేది మరొకటి. తీరా రంగంలో ప్రవేశించిన తరువాత వెనుకకు తగ్గటానికి బుద్ధి పుట్టదు. ఇతరుల వద్ద ఒప్పుకొన్న పనులలో వడి దుడుకులు ఎక్కువ. పైకి చెప్పటానికి వీలు కాకుండా మనస్సును క్రుంగదీసే సంఘటనలు జరుగుతవి. వస్తువులు కాని, డబ్బు కాని ఇతరులకు వద్దకు పోకముందే జాగ్రత్త పడండి. ఆరోగ్యం మాత్రం ముందుకన్నా మేలుగా ఉంటుంది. ప్రయాణాలు అనుకూలించవు. ఇతరులను గురించి నిర్లక్ష్యంగా ఉండతగిన సమయంకాదు. ఆదాయం బాగుంటుంది. బంధువుల వలన శ్రమను సహించు కొనవలసి ఉంటుంది. పూర్తిగా జరిగిన పనుకొన్న పనులే తిరిగి మొదలుపెట్టవలసి వస్తుంది. ముందు ఎప్పుడో లాభించగల సూచనలు తెలుస్తవి.

* * *

## మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

మీ శక్తినిబట్టి, మీ అవసరాన్ని అనుసరించి నడచుకొనటం మంచిది. మీ కొకటి చెప్పి తామొకటి ఆచరించేవా రుంటారు. "తెల్లనివన్నీ పాలు" అని అనుకోవద్దు. ప్రయత్నంవల్ల ధన సహాయం లభిస్తుంది. కుటుంబంలోని వారు మీ అభిప్రాయంతో ఏకీభవిస్తారు. తాడు తెగేవరకు ముడి పెట్టకుండా సమయాన్ని వినియోగించు కొంటారు. ఇంతకుముందు లోపించిన ఆర్థిక ఫలితం తిరిగి భర్తీ అవుతుంది. కుటుంబంలో సుఖ సంతోషాలు కనుపిస్తవి. బంధువుల వద్దనుంచి శుభ వార్తలు తెలుస్తవి. వృత్తిలో మీ మీద నున్న భారాన్ని తగ్గించుకొని విశ్రాంతి పొందగలుగుతారు. ఇతరుల నిమిత్తం చేయు ప్రయత్నాలు దైవికంగా వెంటనే అనుకూలిస్తవి.

* * *

## కుంభం:

(ధనిష 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ప్రస్తుతం భంగ సమయంకాదు. కాని, మీరు ఏ విషయం తలపెట్టినా విమర్శలు, వివాదాలు అయితేగాని అది ఒక రూపానికిరాదు. సంపాదన పెరుగుతుంది. మిమ్ములను బెదిరించటానికి చూచే వారుంటారు. మనో నిగ్రహంవల్ల అంతస్తును కాపాడుకొంటారు. సుఖం తక్కువ. బాధ్యతల భారంవల్ల మనశ్శాంతి తగ్గుతుంది. చేతిలోని పైసా ఖర్చుకాకుండా చూస్తారు. కాని, తలవని తలంపుగా ఏదో ఒక అవసరం ఏర్పడుతుంది. పిల్లల వలన అశాంతి కలుగుతుంది. ఇంతకుముందు అను కొన్న మాటలు ఖచ్చితంగా అమలు జరగటం కష్టం. రాజీ మార్గంలో పనులు తెముల్చుకో గలుగుతారు 29, 30 తేదీలలో భయసూచనలు, అసౌఖ్యము.

* * *

## మీనం:

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

ప్రస్తుతం మీ శక్తిలో లోపం ఉండదు. దుష్టులకు దూరంగా ఉందామనే భావం కలుగుతుంది. అందువల్ల బాహ్యవ్యాపృత్తులను తగ్గించు కొంటారు. వృత్తిలో మందకొడితనం పోతుంది. ప్రస్తుతం క్రొత్త విషయాలను గ్రహించి అమలు జరుపగలుగుతారు. వివాదంగా జరుగగలవనుకొంటున్న పనులు వెంటనే కలిసి రావటంవల్ల ధనం అవసరం అవుతుంది. అలంకారాలు, ఆస్తులు మొద లయినవి కొంటారు. ప్రతి విషయము జ్ఞాపకము ఉంచుకొవటం అవసరం. ఏ వ్యవహారమైన ఉత్తర ప్రత్యుత్తరాలు పెరగకుండా పూర్తి చేసుకొనటం వల్ల సుఖం లభిస్తుంది. వారం రెండవ భాగంలో వేళకు నిద్రాహారాలు అమరక పోవచ్చు. ఇతరుల నిమిత్తం హామీ ఉండవలసిన బాధ్యత పైన పడుతుంది. 

నా పేరు శకుంతల కాదు. నన్ను
శకుంతలా అని పిలవొద్దన్నా
నా. నువ్వేం దుష్యంతుడి
లాగేం లేవులే.

# కథ కాని కథలు

## "నేనూ మనవాణ్ణే"

ఇది పది రోజుల క్రిందట జరిగిన గమ్మత్తయిన సంఘటన. శలవురోజు కదాని సరదాగా సముద్రపుటొడ్డుకు ఒంటరిగా వెళ్ళాను. నే కూర్చున్న బెంచీమీద గాని అంత దగ్గర్లో కాని జనం ఎవరూ లేరు. ఇంతలో జీడిపప్పు అమ్ముకుంటూ ఒక వ్యక్తి అక్కడకు వచ్చాడు. ఈబొంబాయి పట్టణం నాకు క్రొత్త గాబట్టి ఏదో తెలీనివి అడిగి తెలుసుకుంటున్నాను అప్పటిదాకా మా సంభాషణ హిందీలోనే జరిగింది. అకస్మాత్తుగా అతను "మీరు తెలుగువారా" అని, నా చేతిలోని పత్రికనుచూసి తెలుగులో అడిగేసరికి నాకు ఆశ్చర్యం, ఆనందం కూడా అనిపించింది. అతనిది కూడా మన ప్రాంతమే. అతని వేష భాషలను చూసినవారెవరూ అతన్ని ఆంధ్రుడుగా గుర్తించడం కష్టం. ఆమాటే అతనితో అన్నాను. "కృషి చేస్తే ఫలించనిది అంటూ లేదు. దేనికైనా మన ఓర్పు కావాలి. సాయంత్రం ఈ జీడిపప్పు అమ్ముతూ ఉంటాను. ఉదయం 7 గం॥ నుండి 1 గంటవరకు ఒక కంపెనీలో పని చేస్తున్నానండి" అన్నాడు నమ్రతతో. అప్పుడప్పుడు కలుసుకోవచ్చునని అతని అడ్రసు తీసుకొన్నాను. "మీరుండేదానికి దగ్గర్లో గల ఒక ప్రైవేటు కాలేజీకి వస్తే అక్కడ ఉంటాను. సాయంత్రం ఆరు, తొమ్మిది గంటల మధ్య"అన్నాడు. అక్కడకూడా రాత్రి పని చేస్తున్నాడేమో అనుకున్నాను. ఆ మరుసటి దినం అతనిచ్చిన చిరునామాకు పోయి విచారించాను. చక్కని తెల్లని పాంటు, షర్టు తొడుక్కుని నమస్కారమండి అంటూ చిరునగవుతో చేతిలో పుస్తకాలతో దర్శనమయ్యాడు. "ఇందులో ప్రైవేటుగా బి.ఏ. చదువుతున్నానండి"అన్నాడు. అబ్బ! ఆ క్షణం ఎప్పటికీ మనసులో మెదలుతూ ఉంటుంది. జీడి పప్పు అమ్మే మహారాష్ట్ర వర్తకుడిలా కనుపించినా నూటికి నూరుపాళ్ళ తెలుగు వ్యక్తిని చూసినందుకు అతని కనేక విధాల ధన్యవాదాలర్పించా. నా ముఖ్య మిత్రుల్లో అతను ఒకడిప్పుడు.

జి. డి. శర్మ (బొంబాయి)

* * *

## తప్పు గంటలు

మా యింటిపద్ద నున్న పోలీసు స్టేషన్‌లో ప్రతిగంటకు గంట వాయించేవారు. పోలీసు జవానులు తాడు సహాయముతో గంట వాయిస్తుంటారు. ఒకరోజు టైము పగలు 12 గంటలుఅయినది. ఆగంట కొట్టే పోలీసు 12 బదులుగా 13 సార్లు గంటకొట్టాడు. దగ్గరనున్న పోలీసు అతనిని ఎక్కువగా వాయించినందుకు అరిచాడు. తన తప్పు తెలుసుకొన్న పోలీసు వెంటనే గంటను తాడుతో చాలాసార్లు వాయించాడు. కొంచెముసేపు ఆగి ఇప్పుడు చూడు నా తడాఖా అన్నట్లు 12 సార్లు రెండవసారి వాయించాడు. ఆ సమయలో స్టేషన్‌లో వున్న సబ్ ఇన్‌స్పెక్టర్ బయటకువచ్చి "ఏయ్ ఎందుకూ అన్ని సార్లు వాయిస్తున్నావు" అన్నాడు "సార్ మరీ నేను మొదట 12 కు బదులుగా 13 వాయించాను: అది తప్పు అని తెలిసెందుకు చాలా సార్లు వాయించాను. తర్వాత కరెక్టుగా వాయించాను." అని పోలీసు జవాబిచ్చాడు.

"ఇదేమైనా బ్లాక్‌బోర్డు అనుకున్నావా చెరిపేటందుకు ఇకనుంచీ ఇలాంటి పిచ్చిపనులు చెయ్యవద్దు" అని అతను మందలించెను.

యస్.యన్.యస్. నాయుడు (అనంతపురం)

* * *

## "ఇది అదే: అది ఇదే"

1957 మార్చిలో ఒకరోజు నేను ఐదవ తరగతికి పాఠం చెబుతున్నాను సాంఘిక శాస్త్రంలో. అదే సమయంలో వచ్చిన పరీక్షాధికారిని ఆహ్వానించి, కుర్చీలో కూర్చొన్న తర్వాత వారి ఆదేశం ప్రకారం పిల్లలను ప్రశ్నలు వేస్తున్నాను. 'ఆంధ్రప్రదేశ్ ఎప్పుడు అవతరించినది?' అని ప్రశ్న వేశాను.

మొదటి యిద్దరు చెప్పలేదు. మూడవవాడు చెప్పేశాడు. "నిరుడు మన స్కూల్లో మిఠాయి పంచారు గదండీ - అప్పుడు" అని. మొదటి యిద్దరు చెప్పలేక పోయినందుకు విచారముతో వున్న నేను వాడి నుంచి ఆ సమాధానం రాబట్ట వచ్చుననే ధైర్యంతో "అదేనోయ్ ఆ మిఠాయి పంచింది ఎప్పుడో చెప్పు" అని అన్నాను. "అవునండి! ఆంధ్ర ప్రదేశ్ అవతరించిన రోజునే" అ... అన్నాడా కుర్రవాడు. ఇన్‌స్పెక్టర్ పగలబడి నవ్వాడు. నేను నీరసంగ నవ్వాను.

యన్. కోటేశ్వరరావు (దైనాలదావూరు

# తెరమీద తెరవెనుక

వీరాజీ

## ఈ ఏడాది తారాపథంలో వున్న జగ్గయ్య

(గత సంచిక తరువాయి)

*ప్రస్తుతం పదెనిమిది చిత్రాలలో నటిస్తున్న శ్రీ జగ్గయ్య నిజ జీవితంలో కాస్త చిత్రకారుడూ మరి కాస్త* కవీ కూడా. పదండి ముందుకు అనే సినిమాకు 'కవిత్వం'తోసహా బాధ్యత వహించిన యీ నటుడు, 'టాగోర్' పద్యాలంటే చాలా యిష్టపడతాడు. ఆయనకు ప్రస్తుతం ఉన్న పథకాలలో టాగోర్ 'హియుక్రటే'ని తెనుగు చెయ్యడం ఒకటి ఉన్నది

"పైగా మరొకటి "పొలిటికల్" డిక్షనరీ ఒకటి కూర్చాలనే ప్రయత్నం చేస్తున్నాను" అన్నాడాయన

రాజకీయాలంటే పొలిటిక్సు అంటారు చాలామంది. మొదటి పదం కన్నా రెండోది మంచి పరిభాషక పదం. శ్రీ జగ్గయ్య రాజకీయ పారిభాషిక పదకోశం" ఒకటి కూర్చాలనుకోవడం — చాలా మంచిపనే అది నెరవేరుతుందనే అనుకుంటున్నాను అతను ఈ రాజకీయాలను చదువుకు జీర్ణం చేసుకుంటున్న చేసుకున్న వ్యక్తి కాబట్టి "శుభస్య—అలాగే చెయ్యండి" అన్నాను



నలుగురు పిల్లలూ తనదైన వ్యక్తిత్వం ఇంటా నల్గురూ ప్రశంసించే కెరీర్ బయటా గల వ్యక్తి జగ్గయ్య.

## కవిత్వం అంటే మహాయిష్టం

శ్రీ జగ్గయ్య కవితా గోష్ఠులూ, కావ్య సమ్మేళనాలు (భారీ ఎత్తున కాదు) చెయ్యడం సర్వాయే! వారం వారమో నెలకోసారో రెండుసార్లో యిల్లాంటివి ఉంటే మేలని ఈయన ప్రయత్నం చేయడం —అది సినీకారులను కనీస పక్షంగానైనా ఆకర్షించలేకపోవడం జరగడం—గురించి ఆయన నాతో అన్నారు కాస్త బాధపడ్డారు కూడా!

"బహుశా మీకు క్లబ్బులూ గట్రా నచ్చవ్ కాబోలు" అన్నాను నేను

"పుస్తకాలు చదువుకోడం నా హాబీ" అన్నాడాయన ఫిలాసఫీ చదువుతాను

## విరాళానికి నాటకం

నాటకాలను ఆడటం అతనికి చిన్ననాటి విద్యే గాని, "మనోహర" నాటకం వేసి తెనాలిలో రెండు లక్షల రూపాయలు వసూలుచేసి స్థానిక కళాశాల వినియోగార్థం యివ్వడంవల్ల ఈ "నాటక కళ" ఒక ఉత్తమ ప్రయోజనాన్ని సాధించినదని ఆయన ఉద్దేశం ఆ సమయంలో తెనాలి పౌర సన్మానం జరిపింది ఈయనకు!

శ్రీ జగ్గయ్య 'మనోహర' నాటకం ఆ వూర్లో రెండుసార్లు వేశారు 'ఓహో' అన్నారు అంతా!

వైద్య కళాశాలకు అలాగే 'వరంగల్'లో కూడా ఈయన తన నాటక కళను సద్వినియోగంచేసి, చక్కని ప్రదర్శనం యిచ్చి లక్ష రూపాయలు యిచ్చాడు "రెండూ సార్థకమైన ప్రయత్నాలే. వచ్చిన విద్య దైవం యిచ్చిన వరం యిలా విద్యార్థులకు ఉపయోగపర్చ గలిగాను అయామ్ హాపీ" అన్నాడాయన "తాను ప్రజాసేవకు సిద్ధమే" నన్న లక్షణానికి 'రక్తతర్పణం' అన్న నాటకమూ జగ్గయ్య రాయడం మీ కెరుగుదురుగా

## ప్రమాదం తప్పిపోయింది

దైవం అంటే జ్ఞాపకం వచ్చింది

"మీరు నాస్తికులయిన సపోగల ప్రమాదమేం లేదుకదా ?" నవ్వుతూ అన్నాను నేను

"ఆ అన్వేషణ, ఆ సంఘర్షణ ముగిసింది. ఆ ప్రమాదం తప్పిపోయింది. నేను దైవభక్తుణ్ణే" అన్నా డాయన



'ఈ పుస్తకాలే నా స్నేహితులు.'

(ఫొటో: ప్రభాకర్)

—: స్త్రీలకు శుభవార్త :—

"కాంట్రాసెప్" మాత్రలతో గర్భనిరోధం ఒక సమస్య కాదు

[illegible] బెంగాలు [illegible] కంట్రాసెప్'లు లేబరేటరీలలో పరిశోధన చేయబడి, దీని గుణము రుజువుచేయబడినది. ఒక సీసాలో 36 'కాంట్రాసెప్' మాత్రలు వుండును. బహిష్టు అయిన రోజునుంచి 14 రోజులు వరుసగా 36 మాత్రలు వాడిన (తినిన) ఆరు నెలలవరకు గర్భమురాదు. (గర్భము వచ్చిన తరువాత యిది వుపయోగపడదు) అనేక ఆస్పత్రులలోను, అసంఖ్యాక స్త్రీలచేతనూ వాడబడి తృప్తికరముగా పని చేయుచున్నట్లు చెప్పబడుచున్నది. దీనిని వుపయోగించి అధిక సంతానము కలుగకుండా చేసుకొనుట సులభము. ఇందులో అపాయకరమైన వస్తువులు కలుపబడలేదు. నమ్మకమైన ఔషధము.

36 మాత్రలు గల కాంట్రాసెప్ సీసా 1 కి (పోస్టేజితో) రు. 8-60 న.పై.

రెస్కో లేబరెటరీస్, కలకత్తా—13 వారి ఉత్పత్తి. వివరములకు దక్షిణ భారతమునకు ఏజంట్లు :

N. గోపాలరావు & కంపెనీ, 10/129, పార్కు రోడ్, విజయవాడ-1.






మలబద్ధమును పోగొట్టును

వేక్యులేక్స్

రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్

క్రొత్తగా అభివృద్ధి పరచిన వేక్యులేక్స్ మీ పొట్టను పూర్తిగా శుభ్రపరుస్తుంది, మలబద్ధమును పోగొడుతుంది. ఇంటెల్ల పాదికీ మంచిది.




వేక్యులేక్స్

తీయని
విరేచనకారి బిళ్లలు

నికొలాస్‌వారి Ⓝ తయారు

V.O.S.TEL

"ఆంధ్రసచిత్ర వారపత్రిక"లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4″ × 2″, 4″ × 4″ చిత్రాలు పత్రికలో పట్టుగా ఉంటాయి

## క్యాలెండర్లు

నాణ్యమైన ఫోటో ఆఫ్‌సెట్ క్యాలెండర్లకు మమ్ము సంప్రదించండి. క్యాలెండరు బొమ్మలను క్యాలెండరు మాన్యుఫ్యాక్చర్లకు, ప్రింటర్లకు ప్రత్యేక ధరలకు సప్లయి చేయుదుము. మంచి కమీషన్‌పై పని చేయుటకు సమర్థులైన ఏజంట్లు కావలెను. వెలలు 50% తగ్గించబడినవి. వ్రాయండి :

**Ajanta Art Calendar Mfg. Co.,**
**P. B. 255, Madras—1.**

Swastik

## వైద్యము

సంవత్సరాలతరబడ బాధపడుతూ లేక అర్థంకాని మొండివ్యాధులకు నమ్మకమైన చికిత్సకులు. నాడీ పరీక్షతో వ్యాధిని నిర్ణయింతురు. ఆపరేషన్ లేకుండా అనేకవ్యాధులను కుదిర్చిరి. ఇచ్చుటకు వచ్చుటకు వీలు లేనివారు ఫారము కొరకు వ్రాయండి. డాక్టరు N.S. రావుగారు ప్రతినెల ఈ క్రింది విధముగా బస చేయుదురు. ఉదయం 7 గంటలనుంచి సా॥ 3 గంటలవరకు సంప్రదింపవచ్చును.

29 వ తేది : ఒంగోలు. కృష్ణా లాడ్జి, సంతపేట.

30 వ తేదీ : నెల్లూరు : హోటల్ అజంతా, ట్రంకు రోడ్.

1, 2 తేదులు : మద్రాసు : ఎక్సెల్ లాడ్జి, (XL LODGE) పెరియమెట్టు వద్ద, నావల్ హాస్పిటల్ రోడ్, మద్రాసు—3.

**రావూస్ ప్రోడక్ట్సు, ఫోన్: 598**

పాతూరువారితోట, గుంటూరు-1.

SWASTIK

# H.M.V. వారి
# "షెర్పా"

నాణ్యమైన *4 Speed*
"రికార్డు ప్లేయర్"

AC మరియు బ్యాటరీలలో లభించును
ధర. AC రు. 215/-; బ్యాటరీ రు. 185
(ఎక్సైజ్, స్థానిక పన్నులు అదనం)
మావద్ద L. P. & E. P. యిండియన్/యింటర్నేషనల్ గ్రామఫోను రికార్డులు లభించును.

**మాధవ & కో,**
**పార్కురోడ్ _ విజయవాడ.1**

# తెరమీద - తెరవెనుక

కులం తయార్తై తలపెత్తే ప్రమాదం లేదా ?" అన్నది శ్రీ జగ్గయ్య ఆవేదన.

"తాను నమ్మిన సత్యాన్ని— తాను నమ్మిన ధ్యేయాన్ని ఎలాగైతే మనిషి ఆరాధిస్తున్నాడో— అలాగే ప్రచారం చేయగల అవకాశం అందరికీ ఉండా"లని శ్రీ జగ్గయ్య ఉద్దేశం. అతనికి గల



'ఆరాధన'లో

రాజకీయ పరిజ్ఞానం — ఉపన్యాస ధోరణి రెండూ, సినిమా నటుడైనందున 'తారబలం' కూడా పుంజుకుని రాణించాయి!

## 'సినిమా నా కెరీర్'

కవి, వక్త, జర్నలిస్టు అవక సినిమా నటుడు గనుక ఈ విషయాల మీద తప్ప మా ప్రసంగం మరో మార్గం తొక్కలేకపోయింది.

సినిమా నటన ఇవాళ తన 'కెరీర్' అన్నారు శ్రీజగ్గయ్య. అయితే కెరీర్, అంటే వృత్తి, దీనితోనే జీవితం పరిపూర్ణమవుతుందా ? వ్యక్తిత్వం పరిపూర్ణమవుతుందా? తృప్తి లభ్యమైపోతుందా ?

"ఉహూ. ఇంకా కొన్ని అభిరుచులు ఆశయాలు, ఉండాలి వ్యక్తి గత జీవితంలో వ్యక్తిత్వానికి. ఉనికి, సంపాదించుకుని మన జీవితంలో దీన్ని సమున్న తుంచుకోవాలి అదీ జీవితం...."

"నటుడొక పాత్రను జీవిస్తాడు."

"అప్పుడది వెండితెరమీద జీవితం. అలా చేయటంలో ఒక థ్రిల్ వస్తుంది."

"అయితే ఈ "థ్రిల్" వేరు. నిజ జీవితంలో కొన్ని 'ఆశ'యాలు 'ఆశ'లు నెరవేర్పు గలిగితే అదో తృప్తి"—

"ఆత్మ"తృప్తి లభించగల ఒక ఆశయం శ్రీ జగ్గయ్యకు రాజకీయాలలోనూ, సాహిత్యంలోనూ లభ్యమవుతోంది! అందుకనే పదిమందికి పలుకుబడికీ, గ్లామర్‌కీ, గర్వానికీ ఆలవాలమైన సినీరంగాన అడుగుపెట్టి నిలదొక్కుకున్న తర్వాత కూడా ఈయన రాజకీయాల గురించి "స్టడీ" సాహిత్యంలో కృషీ మానలేదు.

మొత్తంమీద వర్గ వైషమ్యాలకు, సంకీర్ణ సంకుచిత తత్వాలకు అతీతమూ, దూరమూ అయిన ఒక 'సిన్సియర్ ప్రమేయం' రాజకీయంతో ఉండాలన్న సత్యాన్ని ఆయన తెల్సుకున్నాడు. తెలియా



'మంచి రోజులు వస్తాయి'లో

జెప్పాలనే ప్రయత్నం చేస్తున్నాడు కూడా!

నిజంగానే శ్రీ జగ్గయ్యకు రాజకీయాల జోలికి పోవడంవల్ల "గ్లామర్ పెరిగిందే" తప్ప తరగలేదు అన్న మాటకు దాఖలా యిప్పటికీ కళాశాల వార్షిక సాంస్కృతికోత్సవాలలో ఆయనకు లభిస్తున్న అగ్రతాంబూలాలే!



శ్రీ సంజీవయ్యతో. జగ్గయ్య నిర్మించిన 'పదండి ముందు'కు ప్రారంభోత్సవ సందర్భంలో.

సినిమా రంగంలోని వ్యక్తులు రంగులు పూసుకుని కేవలం చిలక పలుకులు పలికినట్లు డైలాగు లనేసి, అవకా మరో ఆలోచన లేనివారైతే మరో "విశ్వాసం" 'నమ్మిక' దానికై ఆసక్తి లేనివారైతే వాళ్ళకు వ్యక్తిత్వం అనేది ఎలా చేకూరుతుంది ? "చెక్క బొమ్మలై పోతారు కదా ?" (ఐపోతారు, మరి అన్ని రకాల ఆసక్తి మంచిదే మరి) అయితే శ్రీ జగ్గయ్య విషయంలో తటస్థ పడ్డట్లు అందరికీ యీ ఆసక్తి చిన్నప్పట్నించి ఉండాలి తటస్థపడాలి కదా ?! దానికి విద్యాలయంలోను అవక గ్రంధాలయంలోను—అభిరుచి హృదయపీఠంమీద 'కృషి' జరగాలి కదా ? శ్రీ జగ్గయ్యకు యిది లభ్యం కావడంవల్లనే—సినిమా తారలతో శ్రీ జగ్గయ్యకో ప్రత్యేకత చేకూరింది.

## మంచి మెలురాళ్లు!

"పత్రికలలో పడడం, ఐడీసంతులు అవడం— నాటకాలు వేస్తూ బియ్యే ప్యాసవడం—సాహిత్యం మీద మమకారం — పైగా దేశాభిమానం కలిగి ఉండడం—ఆలిండియా రేడియో వార్తలు చెప్పడం యివన్నీ—సినిమా నటనకు ఎంత మంచి ప్రాతిపదికలో నేను వేరే చెప్పనక్కరలే దను కుంటాను"

నిజంగా నాకు చాలా సంతోష మనిపించింది. రకరకాల జీవితాలలో రకరకాల వ్యక్తిత్వాల పరిచయంతో నట జీవితం పొనబట్టిన రత్నంలా ప్రకాశిస్తుంది కాబోలు ననుకున్నాను.

## పైగా కంఠం

శ్రీ జగ్గయ్య కంఠ మొక ప్రత్యేకత గలది. అదే అతనికి గల పెద్ద 'గ్లామర్' కూడా. గంభీరమూ, సౌందాతనమూ రెండూ ధ్వనించినంత సహజంగా ఆయన గొంతు కరుణరసాన్ని కూడా ప్రదర్శించగలదు ఆ 'కంఠ' మొక వరం (టాలెంట్) ఆయనకు.

శ్రీ జగ్గయ్య కథలోని మలుపు అన్నీ ఒక ఎత్తూ 'పదండి ముందుకు' సినిమాకు తానే రచయితై నిర్మాణానికి సాహసించడం ఒక ఎత్తూను.

(మిగతా వైవారం)

"ఏం చలపతీ.... ఉద్యోగం వచ్చాకా ఈ మంది భాగ్యులపై అంత చిన్న చూపా ?" అన్నాడు హాస్యోక్తిగా శంకరం.

"లేదురా సమంగా చూడలేదు. మనసెక్కడ లేదురా" అన్నాడు చలపతి.

"ఏరోయ్ రోడ్డుమీద మనుష్యులు కనబడడం లేదు. అవున్లేరా.. ఈ తిక్క శంకరం ఎక్కడ కనబడతాడు...పద, పద, హోటల్ వాడు మనకోసం పలవరిస్తున్నాడు.." అంటూ లౌక్యంగా తనపని నెరవేర్చుకోబోయాడు. కాని చలపతి ఉదాసీనంగా అన్నాడు.

"సారి మిస్టర్ శంకరం.. ఇప్పుడు డబ్బు లేవురా"

"ఏం అంత విచారంగా ఉన్నావు—"

"నాకో ఉద్యోగం చూసి పెట్టాలి"

"వాట్— నాతో పరిహాసా లాడుతున్నావా ?

"లేదురా.... ఆ ఉద్యోగానికి రిజైన్ ఇచ్చేశాను"

"గుడ్ గాడ్ ఎందుకు ?"

"ఆఫీసర్‌కు— నాకు సరిపడడం లేదు—"

"ఆ విషయం లోనా ? భాగాలు సమంగా కుదరటం లేదా ?"

"లేదురా.నన్ను చాలా హీనంగా చూస్తున్నాడు. కానిక్రింద జను కట్టేకాడు. ఈ మధ్యన సెలవు కూడా మంజూరు చెయ్యడం లేదు—"

"ఓరేయ్ చలపతి నువ్వు ఇంకా ఓ. సి.లో ఉన్నావు—"

"నా వ్యక్తిత్వం ఆయన చేతల క్రింద దెబ్బ తింటోంది. ఆత్మాభిమానం ఆ ఉద్యోగం వదలుకో మని ఆరట పడింది.. ఆ ఉద్యోగం చేసేకన్నా—"

"ఏ ఉద్యోగమేనా అంతే భాయి.... అనుభవంలో నిరుద్యోగంలో ఉన్న బాధలు తెలిసి కూడా తిరిగి నిరుద్యోగిగా ఎలా మారావు భాయ్.... వ్యక్తిత్వం.... ఆత్మాభిమానం వాగైరా పదాలు ఈ జీవితంలోకి ప్రవేశించాక మర్చిపోవాలి. నువ్వు ఇంకా మారాలి.. నేను వస్తా" అంటూ వెళ్ళిపోయాడు శంకరం.

* * *

ఎండ మండి పోతున్నది—

"ఏరా ఎక్కడికి వెళ్ళావు ? నీకోసం రామనాథం గారు వచ్చి వెళ్ళారు—"

"ఏ.. రామనాథంగారు—" అన్యమనస్కుడిలా—

"మీ సూపరిండెంట్‌గారు—" అంది రాధమ్మ గారు.

"ఆఁ.. నాకోసం వచ్చారా ?.... ఏం చెప్పారు.." కంఠంలో ఆత్రుత.

"ఏం చెప్పలేదు వరండాలో కాసేపు నిల్చొని వెళ్ళిపోయారు"

అవును ఏమని చెప్తారు ? మీ అబ్బాయి ఉద్యోగం పోయిందని చెప్తాడా ? అంటూ మనస్సులో తర్కించుకున్నాడు చలపతి.

తిరిగి బయటకు వెళ్ళిపోయాడు.

"అన్నంతిని వెళ్ళుబాబూ" అంది రాధమ్మగారు.

కాళ్ళకు సంకెళ్ళు పడ్డాయి. అన్నం తినక తప్పలేదు. తరువాత స్నేహితుడింటికి వెళ్ళుతున్నా నని అసత్యం చెప్పి బయటపడ్డాడు.. రామనాథం గారింటికి వెళ్ళాడు. ఆయన వూళ్ళో లేడని తెలిసింది. రాత్రికి గాని రాడుట. చలపతికి పిచ్చెక్కినట్లు యింది.

కాళ్ళకు బలపాలు కట్టేట్లు అన్ని వుగాకు కంపెనీలు తిరిగాడు.. కాని ఫలితం శూన్యం దారిలో

# పాలపొంగు

23 వ పేజీ తరువాయి

మాధవయ్యగారు కనబడి బలవంతంగా చలపతిని ఇంటికి తీసుకొని వెళ్ళారు. గెడ్డం బాగా మాసి పోయింది.

"ఏరా గెడ్డం పెంచుతున్నావ్" అంటూ అడిగింది మంగమ్మగారు. మాటిపోటి, మాటలు అనడంలో ఆవిడకు ఆవిడే సాటి.

"రాణి ఎక్కడికి వెళ్ళిందే—" అన్నారు మాధవయ్యగారు కుర్చీలో కూర్చుంటూ

"దాని స్నేహితులతో కలిసి సినిమాకు వెళ్ళింది"

రాణి లేనందుకు మనస్సులో భగవంతుడికి నమస్కరించాడు చలపతి.

"నేను ఏదో అనుకున్నాను... విన్నా.. నీకు మీ ఆఫీసర్‌కు ఏదో మాట మీద మాట వచ్చిందటగా" అన్నారు మాధవయ్యగారు నింపాదిగా.

"లేదు మామయ్యా.... అయినా ఎవరు చెప్పారు ?"

"అంతా ఆ శర్మ చెప్పాడులే.. చూడు చలపతి.. ఆయన ఏదో అన్నాడనుకో మనం సరిపెట్టుకొని పోవాలిగాని.... మాటకు మాట అప్పజెపితే కష్టం కదూ.... వాళ్ళు పెద్దవాళ్ళు"

"అదికాదురా.. ఆయన చెయ్యవద్దన్న పని చెయ్యడం దేనికి ? చివాట్లు తినడం దేనికి" అంటూ ఇద్దరు మెత్తమెత్తగా చివాట్లు పెడుతూ చలపతికి బుద్ధి చెప్పారు.

ఏదైన చెడుసంగతి ఎంత త్వరగా విస్తారమవుతుందో చలపతికి అర్థమయింది.

ఆ దంపతుల నీతి బోధలు విని, బయటపడ్డాడు చలపతి. ఇప్పుడు అతనిలో పశ్చాత్తాపము రగులుకుంటోంది.... తాను చేసిన తప్పుపనికి విచారిస్తున్నాడు. తిరిగి మళ్ళీ రామనాథం గారింటికి బయలుదేరాడు.

* * *

లైట్ గుప్పున వెలిగింది....

"నువ్వా చలపతీ"

చలపతి మవునంగా తలవంచుకొని నిల్చున్నాడు.

"ఏం అంత ఉదాసీనంగా చీకట్లో నిల్చున్నావ్"

"మీరు ఉన్నారో లేరో కనుక్కుందా మనుకుంటున్నాను. అంతలో మీరు వచ్చారు. లైట్ వేశారు."

"ఆ కుర్చీలో కూర్చో చలపతి" అన్నారు ప్రేమగా.

చలపతి కళ్ళల్లో నీరు తిరుగుతున్నాయి.

"చూడు చలపతీ నువ్వూ చాలా అమాయకుడివి. మంచి చెడ్డా తెలియని వయస్సు నీది. ఈ వయస్సులో కొంత ఓపిక అవసరంబాబూ"

"......"



ప్రతివారం ఆంధ్రదేశమంతటా లక్షలమంది ఆంధ్ర సచిత్ర వారపత్రికను చదివి ఆనందిస్తూ ఉంటారు. మీ స్థానిక ఏజెంటు ద్వారా చందాదారులయితే మీ కాపీ మీకు వారం వారం నిశ్చయంగా చేరగలదు.



# పాలపొంగు

"మనం ఒకప్పుడు చేసిన ఒక అనాలోచిత సంఘటన, అనేక అనర్థాలకు దారి తీస్తుంది—"

"ఉదయం మా ఇంటికి వచ్చారట...." అంటూ నసిగాడు చలపతి.

"అవును వచ్చాను... కాని నువ్వులేవు.... మీ అమ్మగారికి అనవసరంగా బాధ కల్గించడం ఇష్టంలేక ఏమి చెప్పలేదు".

"నేను చాలా అవివేకపు పని చేశానండి.... ఇప్పుడు బాధ పడుతున్నాను. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకొని ఏం లాభం ?"

"అది నీ తప్పుకాదు చలపతీ! ఈ వయస్సే అలాంటిది"

"అనేక బాధలు పడి బరితెగించిన నా మనస్సు మొండిదై, ఈ మూర్ఖానికి తావిచ్చింది— సార్" అన్నాడు గాద్గదికంగా.

"నాకు తెలును చలపతీ నీ బాధలు.. నీకన్నా ఎక్కువ బాధలు భరించాను. కనుకనే నిన్ను సాను భూతితో అర్థం చేసుకో గలుగుతున్నాను.. చూడు బాబూ అధికారంలో ఉండేవాళ్ళకు సాధారణంగా అందర్ని ఆదరంతో అర్థంచేసుకునే శక్తి ఉండదు—"

"నీ బాధ నాకు తెలుసు. కాని మనం మానవులం.. మర్చిపోకు చలపతీ—"

"నేను చాలా పొరపాటు చేశాను. ఇంకో ఉద్యోగం సంపాదించుకోవచ్చు స్వాతంత్ర్యంగా జీవించవచ్చు అనుకున్నాను. కాని అన్ని విధాల చెడిపోయాను."

"మనిషికి ఎన్ని అనుభవాలైనా, తాను నేర్చుకోవలసిన నీతిని నేర్చుకోడు బాబూ.... నువ్వు అదృష్టవంతుడివి. నీ రాజీనామా కాగితం నా దగ్గరే ఉంది—"

చలపతి మొహం ప్రఫుల్ల వదనమైంది.

"అవును ఆ రోజు నేను ఆఫీసర్ గదిలోంచి బయటకు వచ్చేసరికి టేబుల్‌మీద పేపర్ వైట్ క్రింద నీ రాజీనామా కాగితం ఫాన్ గాలికి రెపరెపలాడుతూ కనబడింది. నువ్వు చేసిన ఈ పని నీ జీవితాన్ని ఎంత దారుణంగా మారుస్తుందో నాకు తెలుసు.

"అవును సార్ గత ఇరవైనాల్గు గంటల నుండి యమయాతన అనుభవిస్తున్నాను సార్"

"అంతలో హఠాత్తుగా నిన్ను పిల్చారు ఆఫీసర్ గారు. అప్పుడు లోపలికి వెళ్ళి నీకోసం ఎవరో వచ్చారని, అర్జంట్‌పనిమీద నాకు చెప్పివెళ్ళావని చెప్పాను. ఆఫీసర్ నమ్మాడు. నువ్వంటే ఆయనకు మంచి అభిప్రాయం ఉంది. బాగా పనిచేసేవాడని నమ్మకం ఉంది. నాతో అప్పుడప్పుడు అంటూ ఉంటారు:

"ఎప్పటికైనా చలపతి ఒక ఆఫీసర్ అవుతాడు. చాల నమ్మకంగా పనిచేస్తాడు. పైకి రావలసినవాడు... అందుకనే అతనిని కొంచెం కఠినంగా చూస్తున్నాను."

చలపతి నయనాలు ఆనందాశ్రువులతో నిండాయి..

"మీ మేలు మర్చిపోలేనండి.... ఈ జీవితానికి ఈ అనుభవం చాలుసార్.. నా పాలపొంగుని అణిచి, నిప్పుల పాలుకాకుండా 'కాపాడారు.... మీకు చాలా ఋణపడి ఉన్నాను సార్—"

చలపతి నేత్రాలు కృతజ్ఞతతో మెరుస్తున్నాయ్—

లింతలు వచ్చాయి. అవికూడా చాలానే వచ్చాయి. ఆర్నోకి ఈ అధికారితో మాట్లాడాలని లేదు. సంభాషణ భారమంతా మిస్ లిడియా మీదనే పడింది. అధికారి సంగతంటూ, పారిస్ నగరం గురించి మంచి ప్రపంచజ్ఞానం ఉండటమే కాక యూరోప్‌లో పెద్ద పెద్ద వర్గాలలో ఏమేమి జరుగుతున్నదో బాగా తెలిసిన అమ్మాయితో మాట్లాడటం సంతోషకరంగానే ఉంటుంది కదా! మధ్య మధ్యలో మాత్రం ఆర్నోవంక అదోరక విధంగా చూసేవాడు.

"మీరు దెల్లా రెబ్బియాని యూరప్‌లో కలిశారా?" అని అడిగాడు మిస్ లిడియాని.

అతను, తాము కార్సికాకి వచ్చే నావలో కలిసినట్లు మిస్ లిడియా కొద్దిగా సిగ్గుపడుతూ చెప్పింది.

"అంతేలెండి," అన్నాడు అధికారి మెల్లిగా. "అయితే ఆయన ఇక్కడికెందుకు వస్తున్నాడో మీకు చెప్పాడా?" అని అడిగాడు ఇంకా మెల్లగా.

మిస్ లిడియా వెంటనే తన దర్జా ధోరణిలో "అదంతా నేను అడగలేదు. మీరే అడగండి." అంది.

ఆ అధికారి వెంటనే సమాధానం చెప్పలేదు. కొన్ని క్షణాల తర్వాత ఆర్నో కర్నల్ గారితో ఇంగ్లీషు మాట్లాడడం విని అన్నాడు. "అయ్యా, మీరు చాలా ప్రాంతాలు ప్రయాణాలలో చూసినట్లున్నారు. అసలు కార్సికానే మర్చిపోయినట్లుంది.......ఆ దుస్తులే ధరించటం లేదు."

"ఆర్మీ (సైన్యం) లోనే ఉన్నారా?"

"మానేశాను లెండి."

"ఇంతకాలం ఫ్రెంచి సైన్యంలో

## కొలంబా

21—వ పేజీ తరువాయి

పనిచేసిన తర్వాత ఫ్రెంచి పద్ధతులు బాగా అలవాటు పడ్డట్టేనా?"

చివరి మాటలు కొన్ని బాగా వత్తి పలికాడు.

ఊరికే చెప్పటం కాదుగాని; కార్సికన్‌లు తమ జాతీయ చైతన్యాన్ని ఇట్టే తెచ్చుకుంటారు. తామేదో ప్రత్యేక స్వభావం కల మనుష్యు లనుకుంటారు. ఆర్నోకి కొద్దిగా ఉక్రోషం వచ్చి ఇలా జవాబిచ్చాడు; "అయ్యా, ఆత్మగౌరవం ఫ్రెంచి సేనలో పనిచేస్తే గాని రాదంటారా?"

"నేను రావద్దని రాశాను ఎందుకు వచ్చావ్?" భర్త అడిగాడు.

"మీ ఉత్తరం చదివించుకుందాం అని"

సారంగపాణి (కపిలేశ్వరం)

"కానేకాదు! ఆ ఉద్దేశంతో మాట్లాడనే లేదు; ఇక్కడ మనుష్యుల వేషాలు చాలా చిత్రంగా ఉంటాయని చెప్పబోయాను. అంతే!" అన్నాడు అధికారి. వేషాలు, అనేమాట ఉచ్చరించినప్పుడు ముఖాన్ని వీలయినంత గంభీరంగా మార్చాడు. ఆ పైన కొంతసేపు తర్వాత ఇక వెడతానని సెలవు తీసుకున్నాడు. వెళ్ళేముందు మిస్ లిడియాచేత తన కార్యాలయానికి వచ్చి తన భార్యని చూస్తానని మాట ఇప్పించాడు.

అతను వెళ్ళిపోయిన పిదప మిస్ లిడియా అంది: "ఇటువంటి అధికారులను చూడాలంటే కార్సికా రావలసిందే! మనిషి మాత్రం మంచివాడిలాగే ఉన్నాడు."

"ఏమో—అంత నొక్కి మాట్లాడడం ఎందుకు? దాపరికం ఎందుకు? నా కర్థం కావడం లేదు;" అన్నాడు ఆర్నో.

కర్నల్‌గారు కునికిపాట్లు పడుతున్నాడు. మిస్ లిడియా దానిని గమనించి గొంతుక తగ్గించి, "నాకు రహస్యం ఏమీ కనిపించ లేదు. అంతా అర్థమయింది" అన్నది.

"మీకు నిజంగా మంచి విచక్షణ ఉంది, మిస్ నెవిల్; మాటల్లోనే ప్రత్యేకార్థం స్ఫురిస్తే మీకు నిజంగా అంతా తెలిసిపోయే ఉండాలి."

"నా సంగతి గురించి మీకింకా తెలియాలి...నా విచక్షణ సామాన్య మనుకున్నారా? నాకు కొంచెం ఇంద్రజాల విద్య కూడా వచ్చు! రెండు సార్లు చూస్తే చాలు, మనస్సులో ఉన్నది కనిపెట్టేస్తాను."

"అరి భగవంతుడా! నాకు భయం వేస్తోంది...నా మనస్సులో భావాలు కనిపెట్టారంటే నేను సంతోషించాలో భయపడాలో తెలియటం లేదు."

"దెల్లా రెబ్బియాగారూ!" అన్నది మిస్ లిడియా, ముఖం ఎర్రబడుతూ. "మనం ఒకరి కొకరు కొన్నిరోజులుగానే తెలుసు: సముద్రం మీదా, ఈ వింత దేశంలోనూ......క్షమించండి...వింత దేశాలలో మామూలు చోట్లకన్నా త్వరగా స్నేహం చేస్తారు... అందుకనే, ఆ ఫ్లులతో గాని చెప్పని ఊహాలు కొన్ని బయట పెట్టినందుకు మరోకవిధంగా భావించకండి...కొత్తవారితో వెంటనే కలిసి మాట్లాడలేము కాని ఇక్కడ ఏదయినా సాధ్యం..."

"అలా అనకండి, మిస్ లిడియా!... తప్పకుండా, మీకు తోచినట్లు మాట్లాడండి! అంతకంటేనా!"

"అలాగయితే సరే! మీ రహస్యాలను వెతకాలని కాదు గాని నాకు అర్థం అయిందేమంటే — ఇందాక ఆ అధికారి మీ కుటుంబానికి సంభవించిన విషాద సంఘటన గురించే కదా ప్రస్తావించాడు? మీ దేశం వారికి పగ తీర్చుకునే అలవాటు ఉంది కదా!......"

"మిస్ లిడియా! ఆ ఆలోచన మీ కెలా కలిగిందో..." ఆర్సో ముఖం ఎందుకో గాని మృత్యుకళలికతో తెల్లబడి పోయింది.

"కాదు డెల్లా రెబ్బియాగారూ" అన్నది ఆమె అతని మాటకి అడ్డం వస్తూ. "మీకు ఆత్మాభిమానం అధికమని నాకు బాగా తెలుసు. మీ దేశంలో 'వెండెట్టా' గురించి మీరే చెప్పారు కదా... ఇద్దరిమధ్య యుద్ధం వంటిదేనని..."

"నేను ఎన్నటికయినా హత్య చేయగలనని నమ్ముతారా?"

"ఇంత దూరం మాట్లాడాము కాబట్టి చెబుతున్నాను ఆర్సో గారూ! మీరంటే నాకు చాలా గౌరవం ఉంది కాని," అని ఆమె నేలవంక చూస్తూ, "మీరు మీ దేశానికి తిరిగి రావటానికి ప్రత్యేక కారణం ఉందని నాకు తెలుసు. ఇక్కడ పద్ధతులు కొంచెం అనాగరికంగా ఉంటాయి కాబట్టి మీరు రావలసి వచ్చింది. మీ ధైర్య సాహసాలను సందేహించటం లేదంటే నమ్మండి... ఇక నేను వెళ్ళాలి" అని మిస్ లిడియా లేచి నుంచుంది. "నాకు తల భారంగా ఉంది: బాగా ఆలస్యమూ అయింది! క్షమిస్తారు కదూ? 'గుడ్ నైట్'!" ఆమె చెయ్యి ముందుకు చాపింది.

ఆర్సో గంభీరంగా ఆమెతో కరచాలనం చేశాడు.

"మిస్ లిడియా నాలో మా దేశ సాంప్రదాయాలు అప్పుడప్పుడు పైకి వస్తూ ఉంటాయి. కొన్నిప్పుడు మా తండ్రిగారిని గురించి ఆలోచించినప్పుడు.... ఘోరమయిన ఆలోచనలు వస్తాయి. మీ దయవల్ల అవి నన్నంతగా బాధించటం లేదిప్పుడు! మీకు చాలా ఋణపడి ఉన్నాను."

అని వెళ్ళిపోబోయాడు. మిస్ లిడియా మరొక గుక్కెడు టీ త్రాగటానికి సోఫాలో కూలబడింది.

కర్నల్ గారికి మెలకువ వచ్చి, "డెల్లా రెబ్బియా రేపు సరిగ్గా అయిదు గంటలకి వేట ప్రారంభించాలి!" అన్నాడు.

"అలాగే కర్నల్!"

(ఇంకా ఉంది)

అయినా అననందుకు ఉగ్రుడు మీనాక్షులు అతణ్ణి విచిత్రంగా చూశారు. అతడూ ఆ కళ్ళని పరికించి చూశాడు. అందమైన ఆ కన్నులు వల కన్నులలాగా అతడి మనస్సులోని ఏ అనిర్వచనీయమైన పదార్థాన్నో చిక్కించుకున్నై. కృష్ణారావు తను బయల్దేరిన పని మరచిపోయ్యాడు. ఆమె ఏ స్టాప్ వద్ద దిగుతుందో చూస్తూ ఉండిపోయాడు.

రెండో రోజు ఆఫీసుకి వచ్చాకగాని కృష్ణారావుకు తన తోటి గుమాస్తా కుమార్ తనపై సాగించే దమన నీతి విధానాలూ, తను వాణ్ణి చీవాట్లేయ్యా లనుకొని బస్సెక్కడమూ, కాని ఓ అమ్మాయి సౌందర్యానికి ప్రభావితుడై, హిప్నటైజ్ చేయ బడినవాడికి మల్లే వేరొక చోటికి చేరుకోడమూ గుర్తుకొచ్చినై. కృష్ణారావు మనసులో అనుకున్నాడు : "ఒరే కుమార్ ! నాపైనే దుండగం సాగిస్తున్నావు కదరా! మిత్రుడివికదాని నీతో నాగోడు చెప్పుకుంటే నాకే అన్యాయం చేయ పన్ను కట్టావా ? అయితే ఇంతలోకే భయపడే వాణ్ణి కాదు నేను. విజయం సాధించేవరకూ నా ఉద్యమం కొనసాగించుతాను." పెద్ద రాజకీయ నాయకుని మల్లే అనుకున్నాడు. "నీ ఎత్తుకు పై ఎత్తు వేస్తాను. చూస్తూండు !"

మళ్ళీ సాయంత్రానికల్లా ఓ ఫైలులో తనకు తోచిన తప్పులన్నీ రాసేసి, ప్యూన్‌ని పిలిచి "ఇది కాన్ఫిడెన్షియల్ ఫైల్. ఎవరికీ చూపకుండా నేరుగా తీసికెళ్ళి అయ్యగారికే చూపించి సంతకం పెట్టించి తీసుకురా ! ఎవరికైనా చూపావో నీకూ, నాకూ ఛార్జెస్ తప్పవు ! జాగ్రత్త !!" అన్నాడు. హాయిగా చేతులు దులుపుకుని అయిదవంగానే బయటి కొచ్చేశాడు. రేపు ఉదయానికల్లా తనని ఉద్యోగం లోంచి తొలగించినట్టు నోట్ వస్తుంది. తనకిక స్వేచ్ఛ లభించబోతోంది. స్వేచ్ఛ ! అబ్బ ! ఎంత మధురమైనదాపదం !

"ఎందుకే నీ కింత తొందరా ? ! !" అనే పాట ఈల వేసుకుంటూ ముందుకి నడిచాడు కృష్ణారావు. తనకి తెలీకుండానే అంతకుముందురోజు చూసిన అమ్మాయి దిగిన బస్‌స్టాప్ దగ్గర కొచ్చాడు. మరి కాసేపట్లో అక్కడికో బస్సువచ్చి ఆగింది. అదృష్టవంతుణ్ణి ఎవ్వరూ చెడగొట్టలేరు. ఎంచా తంటే ఏ అమ్మాయి దివ్య సందర్శనం కోరి కృష్ణారావు అక్కడికొచ్చి నిలబడ్డాడో ఆ అమ్మాయి ఆ బస్సులోంచి దిగనే దిగింది. ఆమె బస్సులోంచి దిగుతూంటే కాదంబినీ మాలికల వేదికపై మనోహర నృత్యం చేసే తటిల్లత పొరబాటున నేలకు జారిపోయినట్టుంది అనుకున్నాడు కృష్ణారావు. ఆమెను చూడ్డంతోనే అతడి కళ్ళు మిరుమిట్లు గొల్పడమే అందుక్కారణం.

ఇంతకుముందే నేను మనవి చేసుకున్నట్టుగా అదృష్టవంతుణ్ణి ఎవ్వరూ— ఆఖరికి ఈ కథ చెప్పేవాడయినా సరే— చెడగొట్టలేరు. ఏఁవిటం టారా ? అవధరించండి :

ఆ అమ్మాయి బస్సులోంచి దిగడంతోనే అది తుర్రున వెళ్లిపోయింది. సాయంత్రంపూట పట్ట ణాల్లో వీధులు నిర్జనంగా ఉండవు. కాని ఆ వీధి ఆ రోజెందుకో నిర్జనంగా ఉంది. మరో సంగతేవి టంటే ఆ అమ్మాయి ఆ బస్సులోంచి దిగిన వూపులో తొట్రుబాటుగా దిగింది. ఆ వూపుకు ఆమె చేతిలోని సంచి జారి నేలనబడింది. ఆ సంచి లోని వస్తువులన్నీ చిందరవందరై పోయినై. ఆమె

# తొలగిన స్వర్గం

19-వ పేజీ తరువాయి

వంగి వాటి నేరుకుంటోంది. ఇదిలా ఉండగా —
వీధంతా నిర్జనంగా ఉందని ముందే చెప్పాను. అంటే వీళ్లిద్దరు మినహాగా అని నా అర్థం).

అయితే ఇంకొక్క విషయం చెప్పడం మరిచాను. ఆ వీధిలో వో బక్కచిక్కిన మేక కూడా ఉంది. వీధి నిర్జనంగా ఉందని అనన్నానుగాని నిర్మేషంగా ఉందని అనలేదు కదా ! ఆ మేక చాలా రోజుల నించీ ప్రాయోపవేశ దీక్షలో ఉన్నదేమో, విద్యుల్లత లాంటి ఆ అమ్మాయి వంగి క్రిందబడిన వస్తువు లేరుకుంటోన్న ముహూర్తంలో, ఆమె రెండు జెళ్ళ లోనూ ఒక జడలో తురుముకున్న పువ్వుల దండను చూసినదై "సెభాసు ! నేటి కోగిరము దొరికె ! !" నని సంతోషంతో 'మే'ంకరించి ఆమె పువ్వులను తినే ఉద్దేశ్యంతో చరున వచ్చేసింది. రావడమేఁ



జననమరణ సేకరణ గుమస్తా దగ్గరికి ఒకాయన వచ్చాడు. "అయ్యా! పుట్టినవారి పేరు పిండ్లమాని మాణిక్యం" అన్నాడు.

"అరే! ఈయన మొన్న చచ్చిపోయేడు గదా! మళ్లీ యిప్పుడెలా పుట్టేడు?!" గుమాస్తాకు సందేహం వచ్చింది.

"అబ్బా! ఆయన నా తండ్రయ్యా! వీడు నా కొడుకు!" గట్టిగా అరిచాడతను.

యస్. కె. కె. రావు (రాజం)



విటి, ఒక్క ఉదుటున ఆమె జడలోని పువ్వులను లంకించుకుని వ్యతిరేక దిశలో పరుగు తీసింది.

ప్రాచ్య, పాశ్చాత్య చరిత్రల్లో 'ధైర్యవాన్', 'సాహసవాన్' అనే బిరుదుల కర్హమైన ఐతిహాసిక పురుషులకేమీ కొదువలేదు. సర్వాల్టర్ రాలీ మొద లొని మన సినిమాల్లోని తోట రాముడి వరకూ అందరూ ఈ జాబితాలోనికి వస్తారు. మధ్య యుగాల్లో వీరిని 'గాలంట్ మెన్,' 'నైట్ ఎర్రంట్' మొదలైన పేర్లతో పిలిచేవారు. ఇటువంటి వారు నేడు లుప్తమైనారనుకోవడం మన దృష్టి లోని లోపాన్ని తెలుపుతుంది గాని, సత్యాన్ని తెల పదు. తేరిపార పరికిస్తే అటువంటి వారు— చిన్న సైజులోనైనా సరే— మన కళ్లకి కనబడకపోరు. "ప్రపంచంలో ప్రసిద్ధి వహించిన నూరు మంది గాలంట్‌మెన్" అనే జాబితా తయారు చేస్తే అందులో కృష్ణారావు పేరు కనబడకపోవచ్చు. కాని "నేడు గ్యాలంట్రీ చచ్చిపోయింది" అని మొహం పొడుగ్గా చేసుకుని "ప్చ్ !" అని పెదవి విరిచి విచారంతో తల అడ్డంగా వూపే నిరాశావాదులకు

మాత్రం కృష్ణారావు చేసినపని ఒక అకాశజ్యోతి వలె కనిపిస్తుం దనడంలో ఆశ్చర్యంలేదు.

చెప్పడానికింతసేపయింది గాని కృష్ణారావింత కాలం ఆగనేలేదు. మేక పరుగులంకించుకున్న తక్షణం అతడు దాని వెంటబడి అదిలిసగా మిగిలిన పూలదండను లాక్కుని, చిరునవ్వుతో తిసుకొని వచ్చి దాన్ని సమర్పణ చేసేవాడి పోజులో చేత బట్టుకుని ఆ అమ్మాయి ఎదుట నిలబడ్డాడు. ఇదంతా త్రుటిలో జరిగిపోయింది. అంటే ఆ అమ్మా మేక చేసిన చోరీని గుర్తించి, ఆశ్చర్యపడేలోగానే ఎదుట పూలదండతో సహా అబ్బాయి ప్రత్యక్ష మయ్యాడు. దక్కిన పూలను పంటిక్రింద వేసి నములుతూ, ఆ అబ్బాయి చేసిన పని ఏమీ బాగులేదన్నట్టు మేక "మ్మే.... మ్మే"అని తన నిరసనను తెలివిడి చేసింది గాని, ఆ అమ్మాయి మాత్రం కృష్ణారావుని చూసి హాయిగా నవ్వేసింది. మేక నోటివద్ద గల ఆహారాన్ని తొలగించినందుకు కృష్ణారావు పేరిట చిత్రగుప్తుడిచిఠాలో నూటపన్నెండు కిలోగ్రాముల పాపం ఎక్కువయి ఉండొచ్చు. అయితే ఆ అమ్మాయి నవ్విన నవ్వు చూసేసరికి ఇటువంటి పాపాలు ఎన్ని వేల కిలోగ్రాములయినా చేసేద్దా మనుకున్నాడు కృష్ణారావు.

"చాలా థ్యాంక్సండీ !" అన్నదా అమ్మాయి అతణ్ణి చిరునవ్వుతో వోరగంట చూస్తూ, అతని చేతిలోని దండ అందుకుని.

"మేకలు !.... హుఁ ! మేకలు...." అన్నాడు కృష్ణారావు కోపంగా. అంతకంటే ఈ విషయమై విమర్శించడానికి అతడి నోట మాటలు రాలేదు. ఇంటి కెళ్లంగానే "నేటి నగరాల్లో మేకల బెడద" అనే విషయమై పత్రికా సంపాదకునకో లేఖ ఘాటుగా వ్రాసేద్దా మనుకున్నాడు.

కృష్ణారావు మేకల డైలాగును విని ఆ అమ్మాయి చిరునవ్వునవ్వి, దండను మళ్లీ ధమ్మిల్లములో ధరించడానికి వీలవుతుందేమోనని పరిశీలించి, అలా వీలుకాదని తెలుసుకొని ప్రక్కకు విసిరేసింది. అలా విసరడంలోని 'గ్రేస్' చూసి కృష్ణారావు ముగ్ధుడయ్యాడు.

"మీకు చాలా శ్రమకలిగించాను" అన్నదామె సహజంగా నవ్వి సంచి చేతబుచ్చుకుంటూ.

"నో నో నో నో నో నో నో నో !" అన్నాడు కృష్ణారావు ఆమె విసిరేసిన దండవేపు జాలిగాచూస్తూ 'అబ్బే ! శ్రమేమీలేదు" అన్నాడో గుటకవేసి "శ్రమేమీ లేదండీ !" అన్నాడా విషయాన్ని తేట తెల్లగా విశదీకరించ దలచుకున్నవాడై.

"నన్ను 'అండీ' అనవద్దండీ !" అన్నదామె నవ్వుతూ.

"ఎందుకూ ?" అనడిగాడు కృష్ణారావు.

"నాపేరు విష్ణుప్రియ కాబట్టి" అందామె వెనక్కుతిరిగి కృష్ణారావుకేసి చూస్తూ.

"మైగాడ్ ! పేరు కూడా ఎంత చక్కగా ఉంది ! అనుకున్నాడు హీరో.

"నాకు నా పేరుతోనే పిలిపించు కోవడ ఇష్టం" అన్నదామె వివరణగా

"నాకూ మీ పేరంటే ఇష్టం" అందా మను కొన్నాడు. కాని అది సాధ్యపడలేదు. చివరికెల్లా సర్దుకుని "మీరేం చేస్తుంటారు ?" అనడిగా ఆమెవెంటనే నడవడానికి యత్నిస్తూ.

# తొలగిన స్వర్గం

"మా అమ్మకి మందులు తెస్తుంటాను" అందామె. తర్వాత కిలకిలా నవ్వేసింది.

"అహ ! అదికాదు.... నా అభిప్రాయం...." అతడి అభిప్రాయమేమిటో సరిగా బయట పళ్లేదు.

"పీయూసీ పాసయాను. ఉద్యోగం చేయాలనుంది. కాని దొరకలేదు" అన్నదామె అతడి అభిప్రాయాన్ని గమనించి జవాబిచ్చినదానికి మళ్లే.

"మా నాన్నారు అదో ఎదురుగ్గా అదే ఆఫీసులో పనిచేస్తున్నారు. హెడ్డు గుమాస్తా. అమ్మ రోగిష్ఠి. తమ్ముళ్లు చిన్నాళ్లు" తమ కుటుంబాన్ని క్లుప్తంగా వివరిస్తూ అన్నది.

కొంతదూరం ముందుకి నడిచాక "ఇదే మా ఇల్లు. రండి ! కాఫీ పుచ్చుకు వెళ్దురుగాని !" అంది.

"అబ్బే ! ఇప్పుడొద్దు. మళ్లీ వస్తాను....రేపు" అన్నాడు కృష్ణారావు.

"రేపు తప్పక వస్తారుకదూ " అన్నది నల్లని కాటుక కళ్లను రెపరెప లాడిస్తూ.

"ఈ కళ్లు ఆహ్వానిస్తే ఇక్కడికన్న మాటేమిటి ఎంతటి దుస్తర గభీర భీకర కందరీ సీమలకైనా తరలి వస్తాను." అనుకున్నాడు మనస్సులో.

"తప్పక వస్తాను " అన్నాడు ప్రకాశంగా."

"ఎన్ని గంటలకు ?" అనడిగిందామె.

"ఊఁ .... ఇదేసమయానికి."

"వెరిగుడ్ ! వస్తానండి ! ! రేపు మాత్రం రావడం మరచిపోవద్దు ! !"అని తన విశాలమైన నేత్రాల్ని జ్యోతుల్లా వెలిగిస్తూ ఇంట్లోకి మాయమయింది.

నెత్తిమీద ఒక గట్టిదెబ్బ తగిలినవానికీ, దివ్య సందర్శనం లభించిన వానికీ ఒకే రకమైన అనుభూతి కలుగుతుంది. అటువంటి అనుభూతి తోనే కృష్ణారావు ఇంటికొచ్చాడు. చివరికి భోంచేస్తొంటే కూడా అతడికా అనుభూతిపోలేదు. చెల్లెలు లత "ఏఁ అన్నయ్యా ! ఈ మధ్య పువ్వులు పెట్టుకోవడం నేర్చుకుంటున్నావేంటి ?" అనడిగాక ఈ లోకంలోకి వచ్చాడు. విష్ణుప్రియ పారేసిన మల్లెదండను ఆమె చూడకుండా తాను జేబులో పెట్టుకోవడం అతడికి గుర్తొచ్చింది.

"నా జేబు లెందుకు చూశావ్ ?" అన్నాడు ముందు కోపంగా. కాని అప్పటి మానసిక పరిస్థితిలో ఆ కోపం అట్టేకాలం నిలవలేదు. చెల్లినోరుమూసి 'హోసి లతా ! గట్టిగా అరవకు ! ఒక వారం రోజులలో నీకో మంచి కబురు చెబుతాను" అన్నాడు ఆనందంగా.

సఖ్యం పెంపొందడానికి ఏడడుగుల దూరం కలిసి నడవడం చాలని సంప్రదాయం ఘోషిస్తోంది. ఇక వారంరోజుల్లో ఏం జరగకూడదు ? మమతలు చివురించి, ఆశలు పుష్పించి, అనురాగ రశ్మిలో ఫలోన్ముఖం కావడానికి ఉవ్విళ్లూరుతా యంటే అబ్బురం ఏమి ఉంటుంది ? కృష్ణారావు, విష్ణుప్రియ కుటుంబం గురించి అంతా తెలుసుకున్నాడు. వాళ్లు కూడా మధ్యతరగతికి చెందినవారు తనకి మల్లెనే. ఏదో తండ్రి కష్టాన్నాధారం చేసుకుని జీవిస్తున్నారు. ఆమె తండ్రిని కూడా ఓసారి కలుసుకున్నాడు. ఆమె విషయంలో అంతా **నిశ్చయమైపోయినట్లే అతడు భావించసాగాడు.**

అయితే తాము వివాహం చేసుకున్నా ఇద్దరూ ఉద్యోగాలు చేస్తే తప్ప తమ జీవితం సజావుగా సాగదని తెలుసుకున్నాడు. తన కుటుంబ పరిస్థితులలా అటువంటివే కాబట్టే అతడామెను అర్థం చేసికోగల్గాడు.

వారం పది రోజులయాక లత కృష్ణారావు నడిగింది : "అన్నాయ్ మీ తాయిలం కావాలి "

"ఏం తాయిలం ?"

"ఇప్పి నవ్వావ్ కదూ !"

"ఏవిటి ?"

"తీయగా ఉండేది.... అప్పుడే మర్చిపోయావా తీయని కబురు !"

"ఓహో అదా ! ఇలారా ఈ గదిలోకిరా ! ! ఈ కుర్చీలో కూర్చో ! చూడు ! ఎవరితోనూ చెప్పక. నో సంగతి చెబుతాను. విష్ణుప్రియ అని నో అమ్మాయుంది. వాళ నాన్నే...." కుర్చీ చేతులపై చేతులుంచి చెప్పాడు.

తనకు కలిగిన మధురానుభూతుల్ని మానవుడు ఇతరులతో పంచుకోవాలని తలచడం సహజం. కాని దానివల్ల అతడికి కష్టాలొస్తాయని అతడు తెలుసుకోలేడు.

సాయంత్రం హుషారుగా ఆఫీసునుంచి ఇంటికొచ్చాడు. వెంటనే మొహం కడుక్కొని పార్కుకెళ్ళి ఆమెని కలుసుకోవాలని ఆతడారాటపడుతున్నాడు. టవల్ తీసుకొని బాత్‌రూంలో కెళ్లబోతున్నాడు.

"రేయ్ ! " అని గర్జించాడు నాన్న.

ఉల్లిపడి "హోయ్ !" అని ఆశ్చర్యపోయాడు కుమార రత్నం. నాన్న గొంతుక ఇలా ఉండడం ఎప్పుడూ విని ఉండలేదు.

"ఏంట్రా వెధవ పనులు ? ? ? ఇలాంటి పనులు చేశావంటే డా. చి." అని విక్కచ్చిగా చెప్పేశాడు.

"అప్రాచ్యా వాయనా ! వాళ్లింటి కోడల్ని దులిపితే పిడికెడు మట్టయినా రాలదట ! విక్షణంగా ఇంత తీసుకొచ్చి అందర్నీ తూడాల్సిన వాడివి నీ కేవేం బుద్ధుల్రా ? కాస్త నా మాట వినరా నాయనా ! !"అని తల్లి బ్రతిమాలింది.

కృష్ణారావుకు పరిస్థితి అర్థమయింది. ఈ అవాంతరం వస్తుందని అది ఈ రూపంలో ఉంటుందని అతడు తలచి ఉండలేదు. కుర్రతనం కదండీ !! ఆ వేడిలో వోపిగ్గా దూరం ఆలోచించే శక్తెక్కడ ఉంటుంది ?

"మీరూరకే గొంతులు చించుకోవలసిందే జరగవలసింది జరుగుతుంది !" అనేశాడు.

అక్కణ్ణించి నో పెద్ద సీన్ ప్రారంభం.

"బాబోయ్ ! నాయనోయ్ ! ఏవండోయ్ ! చేసేనయ్యో, గొయ్యో చూసుకుంటానోయ్ ! !" అని తల్లి బాజా పెట్టింది.

నాన్న లౌడ్‌స్పీకర్లా మాటాడేస్తూ చేతులు వూం ! ఓహాటే వూపేస్తున్నాడు.

"ఏవిటాలో చిస్తున్నారు ?" అనడిగింది విష్ణుప్రియ ఆ రోజు సాయంత్రం కృష్ణారావుని.

చెంపమీద చేయి పెట్టుకుని "అంచనాలు తారుమారైన నాడు ఆలోచించక ఏం జేస్తాను ?" అన్నాడు కృష్ణారావు.

"ఏవిటి సంగతి ?" అనడిగిం దామె.

"విన్నీ ! భయపడకు. ఇలా జరిగింది" అని అంతా వివరించాడు.

"మరేం చేయదలచు కున్నారు ?"

"నాకొకటే మార్గం కనబడుతోంది !"

"ఏవిటది ?"

"చెబుతాగా !"

మర్నాడు ఆఫీసుకెళ్లి అన్నయ్యకి జాబు రాశాడు. "అన్నయ్యా ! నువ్వే సాయం చెయ్యాలి. ఇదీ పరిస్థితి" అని వ్రాశాడు. చిన్నప్పట్నించీ అతడంతే. అన్నయ్యే ఏ పరిస్థితుల్లోనూ సాయం జేసేవాడు. ఇప్పుడు తల్లి దండ్రుల్ని ఒప్పించే భారం కూడా అన్నయ్య మీదే పెట్టాలనుకున్నాడు.

అతడి మనస్సంతా వికలమై పోయింది. సరిగా పనిచెయ్యలేక పోయాడు. ఈ మధ్య అతడికి ఈ పనిమీద శ్రద్ధ హెచ్చింది. ఈ పరిస్థితుల్లో తనకి ఆర్థిక స్వాతంత్ర్యం ఎంత అవసరమో గుర్తించాడు. అంచేత మునుపటిలా వెర్రి వేషాలేయకుండా బాగానే విధిని నిర్వర్తించుకొని పోతున్నాడు. ఏవో డ్రాఫ్టులు రాసి, అప్రూవల్‌కి పంపించేశాడు. ఫ్యాన్ అవన్నీ తీసుకొని నేరుగా అయ్యగారి దగ్గర కెళ్లాడు.

కొంతమందికి పరిరక్షకులైన దేవదూతలుంటారు. వారందరూ విచ్చుకత్తుల బరాబరులతో జాగరూకులై ఆ వ్యక్తులకే అపాయమూ రాకుండా పహరా కాస్తుంటారు. కాని ఒక్కోసారి ఆ 'గార్డియన్ ఏంజెల్స్" మైమరచి నిదురిస్తారు. అప్పుడా వ్యక్తులకు సంభవించే పాట్లు దేవుని కెరుక ! అలాంటి వాళ్లనే మనందురదృష్టవంతులంటాం. దురదృష్టవంతులెవ్వరూ బాగు చేయలేరు— ఆఖరికి ఈ కథకుడైనా సరే !

ఐదైంది. ఇంటికెళ్దామని కృష్ణారావు భారంగా లేచాడు. ఫ్యానొచ్చి మేనేజరు పిలుస్తున్నాడన్నాడు. కృష్ణారావు వినుగ్గా అతడి వెంటే నడిచాడు.

"కృష్ణారావ్ ! ఏవిటిది ?" అని జోగయ్యశర్మ గద్దించి నో కాయితాన్ని అతడి చేతి కందించాడు. కృష్ణారావు దాన్నందుకుని చూశాడు. అది అతడు రాసిన కాయితమే. శుభ్రంగావుంది. కాని మార్జిన్‌లో మాత్రం "మై డియర్‌విన్నీ !" అనీ, దానిక్రింద "అన్నయ్యే సాయం చేయాలి !" అనీ అక్షరాలున్నయ్.

"ఏవిటా రాతలు మార్జిన్లో !" తిరుగా గద్దించాడు. పూర్వమైతే ఇటువంటి గద్దింపును విని ఉంటే "ఇదిగో రాజీనామా !" అని ఉండేవాడు. ఇప్పుడు మాత్రం బిక్కచచ్చి మాటాడ లేక అలానే ఉండిపోయాడు. ఏదో పరధ్యానగా ఉండి అలా వ్రాశానని తెలుసుకున్నాడు.

"ఈరోజాఫీసరు పిలిచి నన్ను చీవాట్లెట్టారు తెలుసా ? నీది టెంపరరీ సీటయినా ముఖ్యమైనదని తెలుసుకో ! కాస్త ఒళ్ళు దగ్గరుంచుకుని పని చేయాలి ! మీ నాన్న బ్రతిమలాడాడు కాబట్టి కాని...." అర్థోక్తిలో మేనేజరు ఆగిపోయాడు.

మవునంగా బయట కొచ్చేశాడు. ఫ్యాన్ కనబడితే "తాతబ్బాయి ! కుమార్ వూళ్లో లేడా ?" అనడిగాడు.

"లేరుసార్ ! టెలిగ్రామొస్తే అర్జంటుగా వూరెళ్లారు. వాళ్లనాన్నగార్కి బాగులేదట"

కుమార్ ఇప్పుడుంటే ఎంత బాగుండును ! అనుకున్నాడు. తన మనసెందుకో సరిగాలేదు. పనిలో దృష్టి సరిగా కేంద్రీకరించ లేకపోతు

న్నాడు. ఎప్పుడూ పరధ్యానంగా ఉండడ మలవా టయింది. ఈ పరిస్థితుల్లో అతడి స్నేహితుడే ఉంటే ఎంతో బావుండేదనిపించింది.

ఒక వారం రోజులు గడచిపోయింది. ఈ రోజు ల్లోనే కృష్ణారావు పనిచేసే ఆఫీసులో అధికారి గదిలో జరిగిన డైలాగు :

## తొలగిన స్వర్గం

"మిస్టర్ శర్మా !"

"యస్సర్ !"

"యఫ్ సెక్షన్‌లో జరిగేపని నాకు సంతృప్తి కలిగించలేదు."

"యస్సర్ !"

"ఇంకో మూడు నాల్గుసార్లు చూసి ఫర్దర్ యాక్షన్ తీసుకోండి !"

"యస్సర్ !"

"అతడు టెంపరరీ కాండిడేటుకదా !"

"యస్సర్ !"

ఇదయ్యాక శర్మ మళ్ళీ రావుని పిలిచాడు. "లేదండి నా మాట నమ్మండి! నాకు కొంత అవకాశం ఇవ్వండి నాకు ఆరోగ్యం సరిగా ఉండడంలేదు. అందుకే సరిగా పనిచెయ్యలేకపోతున్నాను. నాకు ప్రపంచంలో ఆధారమైంది ఇదొక్కటేసార్! లేకుంటే నాపని అన్యాయమైపోతుంది!" అన్నాడు. అతడి కళ్లల్లో తిరిగే దైన్యాన్నిచూసి శర్మ మాటాడలేక పోయాడు.

భారంగా ఇంటి కెళ్లాడు రావు. ఎవరితో మాటాడ లేదు. ఎనిమిదవంగానే చెల్లి నడిగి అన్నం పెట్టించుకు తిని నిద్ర పోయాడు.

ఒక శిల్పి భవనం నిర్మిస్తున్నాడు. అతడి దగ్గర కెళ్లి చూశాడు కృష్ణారావు. ఆ శిల్పితనే! తనొక పెద్ద భవనం నిర్మించాడు. ఎంతో అందంగా ఉంది. "ఇదీ నా స్వర్గం"అని ఆ భవనంపై ఒక ఫలకాన్ని చెక్కాడు. ద్వారం ముందు రెండు అందమైన ప్రతిమల్ని సృష్టించాడు. తన నిర్మాణాన్ని విన్నీకి చూపిద్దామని సంతోషంతో వెళ్లి ఆమెని తీసు కొచ్చాడు. ఆమె భవనాన్ని చూసి ఆశ్చర్యపోయింది. ఆమె ఆశ్చర్యాన్ని చూసి అతడు సంతోషించాడు ఉల్లాసంగా వారా ఇంటిని ప్రవేశించబోయారు. కాని విచిత్రం!! ద్వారం ముందున్న రెండు ప్రతిమలూ వారిద్దరికీ అడ్డం వచ్చినై. వారు పరికించి ఆ ప్రతిమల్ని చూశారు. అవి ప్రతిమలుకావు. ఒకరు కృష్ణారావు నాన్న, ఇంకోరు అమ్మ. భయంగా వాళ్లని చూసి ఇద్దరూ పరువెత్తారు. వారికి దొర క్కుండా పరుగెత్తి, తప్పించుకుని ఎలాగో భవ నాన్ని ప్రవేశించారు. ఈ సారి ఒక పెద్ద స్తంభం వారి దారికి అడ్డంవచ్చింది. వారు దాన్ని దగ్గరి కెళ్లి చూశారు. అది స్తంభంకాదు. ఓ పెద్దకలం. అధికారి వాడే అందమైన కలం. దానిలోంచి ఇంక్ ప్రవాహం లాగా వస్తోంది. నల్లని సిరా. ఇద్దరూ ఆ సిరా ప్రవాహంలో కొట్టుకు పోయారు. విన్నీ చెయ్యి తన చేతిలోంచి జారిపోయింది. అతడు మునిగి తేలుతూ గట్టిగా అరుస్తున్నాడు: "విన్నీ!" సిరా అతణ్ణి పూర్తిగా చుట్టు ముట్టేసింది. నల్లని ఇంకు! దానిలో మునిగి పోయాడు. ఎక్కడో అగాధంలోకి మునిగి పోతున్నాడు. "అన్నయ్యా! రక్షించు" అనరిచాడు. తల పైకెత్తి చూస్తే అన్నయ్య నిర్లిప్తంగా నవ్వుతున్నాడు. అలా నవ్వు తూనే అన్నయ్య మాయ మయ్యాడు. అంధకారం అంతా కారుచీకటి. ఆ అంధకారం లోనే త్రుళ్లిపడి కృష్ణారావు కళ్లు తెరిచాడు. అప్పటికి అర్ధరాత్రి దాటింది. తర్వాత అతనికి నిద్రపట్టలా.

అన్నయ్య దగ్గర్నించి ఎదురుచూసిన జాబు ఆరోజు వచ్చింది. చింపి చూశాడు. అది వదిన వ్రాసింది.

"చిరంజీవి మరిదికి ఆశీర్వాదాలు. నువ్వు మీ అన్నయ్యకు రాసినజాబందింది. ఆయనకి తెలీ కుండా ఈజాబు నీకు రాస్తున్నాను. కష్టసుఖా లుంటై గాని మగాళ్లు కదూ. అన్నీ మనసులో దాచుకుంటారు. ఆడదాన్ని కాబట్టి గోడు వెళ్ల బోసుకుంటున్నాను. మరోలా అనుకోకు. నా సంగతి నీకు తెలుసు! మొహమాటం లేదు. మనసులో దాచుకుండేదాన్ని కాదు. నువ్వు రాసిన సంగతి నే నర్థం చేసుకున్నాను. ఏంచిటో నాకనిపిస్తుంది మన కష్టాల కంతుండదా అని. మొన్న మా పెద్దాడు చిన్న సైకిలు కావాలని మారాంచేసి గిరి కీలు కొడితే, కొనివ్వలేకపోయాను. ఇక పెద్దా డయ్యాక వాడి మనసులోని కోరిక నెలా తీరు

స్తానా అనిప్పట్నుంచే భయం వేస్తోంది నాకు. పాపం ఏ కోర్కె తీర్చలేక పోయినందుకు మాత్రం అత్తగారూ, మావగారూ ఎంతవరకు బాధ్యులు? వారిని అని కూడా ఏమీ లాభం లేదు. ఇహ మీ అన్నయ్య కూద్దామంటే, 'ఆయన మూడొందలు సంపాయిస్తున్నారన్నమాటే కాని మా అవసరాలకే సరిపోదాయన సంపాదన. ఉండేదా మహానగర మాయిరి!! ఇళ్ల అద్దెలు విపరీతం. కొనబోతే అంతా కొరివే! మా సంగతే చూడు. మా చిన్న ఫ్లాట్‌కే యాభై రూపాయలిస్తున్నామా? మీ అన్నయ్య పై ఖర్చులకే సుమారో నూర్రూపాయలౌతాయి. పెద్ద ఉద్యోగం గదా! ఆమాత్రం ఖర్చులు వారికుండక పోవు. అయినా వారి ఖర్చుల్లో ఏమాత్రం తగ్గించలేను. ఇక పాలూ, పెరుగులకే యాభైదాకా అవుతాయి. ఇంత ఖర్చుపెట్టినా చిట్టిదానికి సరిగా పాలేనా ఉండడంలేదు. ఇంటిసామాన్లు అవీ యాభై రూపాయలేనా అవుతాయి. మళ్లీ టిఫిన్లేనా తినము. రెండుపూటలా భోజనమే సుమా. వంటచెరుక్కి మరో పాతిక. జీతాలొచ్చినాడూ, మరేవేనా స్పెషల్ అకేషన్స్‌లోనూ మీ అన్నయ్య స్టాఫ్ కంతటికీ టీపార్టీ యిస్తారు. అప్పుడో పాతిక దాకా ఖర్చవుతుంది. ఇలాటివి నెలకి కనీసం ఒహటన్నా పార్టీ ఉంటుందంటే నమ్ము. ఇన్సూరెన్సుకి నెలకి ముప్ఫైఆర్రూపాయలు కడతారు. చిల్లర

# తొలగిన స్వర్గం

ఖర్చుల్లో నూటాయాభైదాకా ఉంటై. దుబారా ఖర్చులంటే నేను రోజుకి కొనుక్కునే రెండణాల పువ్వులే సుమా! ఇహ నాకు ఇంకెడు చాకిరీ తప్పదుకదా! కుర్రాడి కెందుకీ యిబ్బందులన్నీ రాయాలనుకుంటూనే రాసేశాను. ఏమీ అనుకోకు. వీలైతే యిక్కడి కోసారిరొచ్చి మీ అన్నయ్యతో మాట్లాడి వెళ్లు. మాకే యిబ్బందిగా ఉంది. నీ క్కావలసిన సదుపాయాలు కలిగించగలనని నాకేమీ నమ్మకంలేదు. నీవే ఆలోచించుకో! మంచి చెడ్డలు తెలిసినవాడివే కదా! నీకు తోచింది మనస్ఫూర్తిగా చెయ్యి. చిట్టి, వెంకట్ నీకు టాటా చెప్పారు.

ఇట్లు, మీ వదిన
సుందరి.

ఈ ఉత్తరం చదువుకుని కృష్టారావు అసహ్యించుకున్నాడు. అన్నయ్యే రాయించాడా ఈ ఉత్తరాన్ని? తనకి డబ్బు కావాలనుకున్నదా వదిన? నైతిక సహాయం కావాలని తను రాస్తే ఆడిట్‌కి పంపించినట్టు ఏంటిటా పద్దులు రాయటం? పైగా మూడొందలంటూనే అయిదొందలకి లెక్క చూపిందే! వదిన మంచి ఘటికురాలు! ఎంత అవస్థపడుతోంది పాపం! అనుకున్నాడు వెగటుగా.

కృష్టారావు గుండె దిటవు చేసుకున్నాడు. తన ఆశయాలకు తిలోదకాలు ఇచ్చుకోడానికి అతడి మనసొప్పలేదు. అతడేమీ హీరోదాత్తుడు కాదు. అయినా అతడికీ ఓ మనస్సంటూ ఉంది. దానికి కావలసిన మంచి చెడ్డలు తెలుసును. అంచేత అతడో నిర్ణయానికి వచ్చాడు. తానో గట్టి ఉద్యోగం చూసుకోవాలి. అందాకా యిప్పుడున్నదే పనికొస్తుంది. అంచేత కాస్త శ్రద్ధగా దీన్ని వెలగబెట్టాలి. పెళ్లిని ఏ పరిస్థితుల్లోనూ వాయిదా వేయరాదు. ఆలస్యం అమృతం విషం. అంత దాకా పరిస్థితులు వస్తే వేరే కాపురం పెట్టొచ్చు ననుకున్నాడు.

సాహసించి, ప్రపంచాన్నెదిరించి, ముక్కుపచ్చ లయినా సరిగా ఆరని కృష్ణారావు విష్ణుప్రియను గుళ్లో పెళ్లి చేసుకున్నాడు.

పాఠక మహాశయులారా! మీ రిలా జరుగుతుందని ముందుగానే వూహించారు కదూ! కాని ఇది కూడా వినండి:

రెండోరోజు ఆఫీసుకెళ్తే తన టేబిల్‌పై ఓ నోట్ ఉంచి వెళ్లిపోయాడు ప్యూన్. దానిలో ఇలా ఉంది: "ఎఫ్ సెక్షన్ తాత్కాలిక గుమాస్తా వై. కృష్ణారావు ఎన్ని వార్నింగులనైనా లెక్కచేయక తన ఉద్యోగధర్మాన్ని సరిగా నిర్వర్తించనందుకు అతణ్ణి ఉద్యోగంలోంచి తొలగించడమైనది."



## చదువల్లావ - బి. వి. సత్యమూర్తి

ఇదిగో పోలీస్ పోలీస్.. అర్జంట్....

ఏంజరిగింది.. ఏంజరిగింది?!!!
ఆపంలేదు మీనెంబరెంతో చూడాలని...

మొన్నమా జయశ్రీని నెంబరు అడిగినప్పుడు 'అక్కడ నుంచునే బుర్రమీసాల పోలీసు నెంబరే తననెంబరుకూడా' అని,యిమ్మన్నిచూపించింది...222కదూ థేంక్స్.
రిజల్ట్స్ వచ్చాయిలెండి

సత్యమూర్తి

భాస్కరం సురేఖను "నచ్చలేదని చెబితే చాలు అనుకున్నాడు. కాని వసంతకు ధనమ్మగారి కుదిర్చిన సమ్మంధం చెడగొడుతుందేమోనని భయం.

## 15

"ఇంతకీ భాస్కరం పద్మావతిని ప్రేమిస్తున్నాడా లేదా ?"

"ఒక వేళ పద్మావతి భాస్కరం స్నేహాన్ని అపార్థం చేసుకుని భ్రమపడ్డదేమో...." సురేఖ మనసు పరిపరి విధాలా ఆలోచించసాగింది.

"బహుశా ఈ భాస్కరం జీవితాలతో చెలగాట మాడుతున్నాడేమో ?...."

"ఛీ ఛీ ! మగజాతిని నమ్మమని ఎవరు చెప్పారు ? పద్మావతి అంద చెందాల నటుంచి, ఆ పిల్ల ఆస్తి పాస్తులూ ఆర్థికవు టంతస్తూ సర్వ సాధారణమైనవి గనుక రాజును చూసిన కళ్ళ మొగుణ్ణి చూస్తే మొత్త బుద్ధి అని, తన సమ్మంధం చూడవచ్చాడేమో ? ఇతగాడు ?"

"దొడ్డమ్మ ఆస్తినా ? నన్నా ఇతను చూడ వస్తే ?"

ఆలోచన లామె గుండెలు తోడేశాయి.

కాని భాస్కరం సంస్కార హీనుడిగాను అవ కాశవాదిగాను ఆమెకు అగుపించడంలేదు. పెడ్డగా అతని గురించి ఆలోచించలేక పోతున్నది సురేఖ— "పద్మావతి గురించి తానెందుకు జాలిపడాలి ?"— అదో ప్రశ్న.

రెండు క్షణాలు ఆలోచించడం మానేసింది— కిటికీలోనుంచి ఆకాశంలోకి రెండు క్షణాలు దీర్ఘంగా. చూసి నిట్టూర్చి లేచి సొరుగు దగ్గరకు వెళ్ళింది.

కాయితం కలం తీసుకుని ఉత్తరం రాద్దా మని కూచున్నది.

ఐతే ఏమని రాయడం ?

"మీ భాస్కరం దగాకోరు పద్మావతీ" అని రాస్తేరా ? అసలు భాస్కరం దగాకోరా ?

కాలేజీల్లో మాట్లాడుకొనే ఆడామగా అందరూ ఒకర్ని ఒకరు ప్రణయ దృష్టితోనే చూడాలా ? ఒకవేళ అతని వాత్సల్యాన్ని తన స్నేహితురాలే తప్పు అర్థం చేసుకుంటే ?

భాస్కరం గురించి తెలుసుకోకండా "ఇదుగో నీ ప్రియుడు"అని పద్మావతికి ఇవ్వడం నచ్చలేదు తనకి.

"భాస్కరంగారు మంచివాడు...." అనిపి స్తున్నది పదేపదే.... పద్మావతిది భ్రమా ? తనది స్వార్థమా ? భాస్కరానిది దగా ? ఏది నిజం ?

అంతలో ధనమ్మగారు వచ్చింది.

"విన్నావుటమ్మాయ్ ! సుబ్బారావుగారేమన్నాడో" నన్నదామె ఉద్వేగంగా

గభిక్కున కాగితమూ కలమూ సొరుగులో తోచేసి "ఏమిటి దొడ్డమ్మా" అన్నది సురేఖ.

"మావాడు కట్నం కానులమీద అంత పట్టించడండీ! పైగా ఇవ్వడానికి మనస్కరిం చడూ .... అన్నాడట సుబ్బారావు.... చూశావా ? పాపం రాఘవేంద్రం అన్నయ్య గుండెల్లో రాయి పడింది." అన్నదామె కించిత్ స్వాతిశయంతో.

సురేఖ మాట్లాడలేదు.

"ఔను పాపం ! కుర్రవాడు కొస్త జీవితం పాటుకొనేదాకా అలాగే అంటాడు గానీ, ఈ రాఘ వేంద్రం ఆ ఒక్కగా నొక్క కొడుకే అని ఆశలు పెట్టుకున్నాడు కదా .... కొన్ని కట్నం

# ప్రేమకు పగ్గాలు

13—వ పేజీ తరువాయి

కానూ ఇప్పించవద్దుటమ్మాయ్ .... " ఆమె ముకుందరావు తండ్రి మీద జాలిపడ్డది.

సురేఖ దీర్ఘాలోచనలో మునిగి ఉండటాన్ని ధనమ్మగారు ఖాతరు చేయలేదు.

"నేను మాత్రం రాఘవేంద్రం పక్షమే. పాపం అతగాడు నన్ను నమ్ముకున్నాడు. లేపోతేనా యీ పాటికి గల ఆ ఒక్క కొంపనూ కోర్టులో వేలం వేయిద్దును" అన్న ధనమ్మగారి మాటలకు మాత్రం "మన కెందుకులే దొడ్డమ్మా" అన్నది సురేఖ.

"ఔను అనుకో .... కాని ఈ రాఘవేంద్రం తన కొడుక్కు ఎక్కడి పిల్లను చేసుకొని, నే కోరిన సమ్మంధం నాకు తేనూ అంటే వూరుకుంటానా?" అన్న దామె ఆవేశంగా .... అని అంతలో తమా యించుగుని "చిన్నపిల్లవు. ఇవన్నీ నీ కెందుకులే ..." అన్నది.

"నేను యింకా చిన్నపిల్లనే అంటావా ? దొడ్డమ్మా ?" సురేఖ అడిగింది.

ప్లీడరు : (కొత్తగా వచ్చిన క్లయింటుతో) నేనుగాని నీ కేసు గెలవలేక పోతే ఈ వూళ్లో ఉన్న తక్కిన యాభైమంది కూడ ఏమీ చెయ్యలేరనుకో!

క్లయింటు : చిత్తం! కాని ఆ తక్కిన యాభైమంది కూడా యిలాగే అన్నారు బాబూ !

యస్. కె. కె. రావు (రాజం)

"ముకుందాన్ని ఒప్పించాము. ఐదారువేల లాంఛ నానికి .... ఇప్పుడు కాదూ, కూడదూ అంటే ఎలాగ ? ఆ కుర్రవాడికి కంత పెడసరం ఎందుకూ అంట ? పరిలే జానికమ్మ తన కూతురు పెళ్ళికి తహతహ లాడుతున్నది. అది కావాలి అంటే— ఈ భాస్కరాన్ని ముక్కుకు తాడు వేసి లాక్కొ స్తుంది." అన్నదామె.

సురేఖ ఆశ్చర్యంగా చూసింది.

"ఔనమ్మాయ్ ! జానికమ్మ సయాన తల్లి కాదు భాస్కరానికి—సవితల్లి".

చివుక్కుమంది సురేఖ మనసు.

ఆ మాటకొస్తే ధనమ్మ మాత్రం తనకు పెంపుడుతల్లి కాదూ ?

సురేఖ అడుగుదా మనుకుంది. భాస్కరం తనను యిష్టపడ్డాడా ? అని గాని నోరు విడలేదు.

ధనమ్మగారే చెప్పింది, సురేఖ దగ్గరిగా కుర్చీలో కూచుని "పిల్లవాడు సలక్షణమైనవాడు .... నీకు దీటు వస్తాడు. కాస్త ఛాయ తప్ప అంతా చెక్కిన విగ్రహం .... కాని విపరీతంగా ఉంది .... కట్నం వద్దన్నాడూ—పెళ్లి చదువైయ్యేదాకా వొద్దన్నాడూ ? అంటాడు రాఘవేంద్రవు అన్నయ్య" ఆమె ఆశ్చర్యపోతూ చెప్పింది.

"పోనీ ముకుందాన్ని కూడా కట్నంలేకుండా ఒప్పించు దొడ్డమ్మా"

"బాగానే ఉంది .... పరువు తక్కువ కాదుటే.— ధనమ్మ అల్లుణ్ణి అన్ని లాంఛనాలతో తెచ్చుకుంది. అతగాడి మొహాన వేలకువేలు గుమ్మరించింది అని అందరూ అనుకుంటే మేలా ? కాదా ?"

ధనమ్మ రెండు క్షణా లాగి తేల్చేసింది. "వీడు లొంగిరావాలి—నాకు అల్లుడు అవ్వాలి. లేదు కదూ—ఆ 'వసంత' పెళ్లి ఈ జన్మకి కాకుండా చూస్తాను. ముకుందానికి నా యావదాస్తి రాసేసి మరీ అల్లుణ్ణి చేసుకుంటాను"—

ఆమె చరచరా వెళ్లిపోయింది బుసలు కొడు తున్న పాములాగ.

సురేఖ దిగ్భ్రాంత అయింది.

"ముకుందరావును తను ఎరుగును—అతన్ని పెళ్ళాడటమా ? అంతగంటే చావడం మేలు .... స్వయంగా వచ్చి ముకుందం "తనకు వసంత ఎంతో యిష్టమని చెప్పాడు" తనతో. తను కూడా "అదృష్టవంతుడివి. నీకు కోరిన అమ్మాయి దొరి కింది" అని అభినందించింది.

"ధనమ్మగారి హయాం తనమీద నెందుకు ఉండాలి ?" అని దుఃఖపడ్డదాపిల్ల.

సురేఖ యీ ప్రశ్న వేసుకున్నప్పుడల్లా దుఃఖం వస్తుంది.

"భాస్కరం ఒక్కడే యీ తగవు తీర్చగలడు.... తాను పద్మావతిని ప్రేమిస్తున్నానని అతగాడన్న రోజున—ముకుందరావు తాను వసంతను కోరు తున్నానని అన్న రోజున....

సురేఖకు గుండె జల్లుమన్నది. అందరూ అందరికీ ఐపోతారు. తనకు ధనమ్మకూడా దూరమై పోతుంది.

ధనమ్మగా రెవరు ?

"దొడ్డమ్మని వొదిలి నే బ్రతుకలేను" అను కున్నది. లేచి ధనమ్మగారి గదిలోకి వెళ్లింది. ఆమె ఇనప్పెట్టె ముందు కూచుని ఏవో దస్తావేజు కాయితాల సొరుగును పరిశీలిస్తున్నది.

ఈ "భాస్కరాని దంత దగుల్బాజీతనం ...." అని చెబుదామనుకున్నది ఆమెతో కాని .... సురేఖ !

దొడ్డమ్మ దగ్గిరిగా వెళ్లి ఆమె "ఏమిరా ! యిలా వచ్చావు" అని ఆప్యాయంగా పల్కరించే గానే నేలను చతికిలబడి ఆమె వొళ్ళో బుర్ర దూర్చేసుకుంది.

ధనమ్మగారు సురేఖను అక్కునచేర్చుకుని "నా బంగారు తల్లికేం కావాలే" అన్నది.

"ముకుందం నాకు వద్దు దొడ్డమ్మా .... ఆ వసంతకే యివ్వు" అన్నది గోముగా సురేఖ.

"ఓస్ ! ఇంతేనా ఆ "వసంత" అన్నయ్య యీ విషయం గ్రహించినాడు అలాగే చేస్తా సరేనా ? ఇంతకీ భాస్కరం నీకు నచ్చాడా ? దొంగకానా ?

సురేఖ ఉలిక్కిపడ్డట్లు లేచి పమిట సవరించు కుని, సిగ్గును త్రోసి "అతనికి నేను నచ్చను దొడ్డమ్మా" అని అక్కణ్ణించి విసవిసా వెళ్లి పోయింది సురేఖ.

తన ప్రవర్తన తనకే అర్థంకావటం ఆ పిల్లకు. కాని ధనమ్మ భాస్కరాన్ని సాధించా లనుకుంది. "సురే ఖకు ముకుందం దీటురాడు మరి !" ఆమె ఉద్దే శంలో. "భాస్కరం బాగుంటాడు !"

# ప్రేమకు పగ్గాలు

"మా రోజుల్లో వయసుమళ్లినవారూ, తల నెరిసినవారూ తప్ప — కుందనపు బొమ్మల్లాంటి పిల్లలకు కూడా మంచి సమ్బంధాలు వచ్చేవికావు .... మానుగు మీసాలవాళ్లంతా అప్పుడు లేరు ...."

జానకమ్మగారికి కాబోయే అల్లుడు ముకుందం వచ్చాడన్నది ఆ మాటల తాత్పర్యం.

"అంటే మవ్వు నన్నేగా దెప్పి పొడవడం ...." అన్నాడు సుబ్బారావుగారు నవ్వుతూ.

"అవ్వ: ....! ఎంతమాట మీకేం ?? ఈనాడూ తక్కువలేదూ" అని లెంపలు వేసుకున్నదా యిల్లాలు.

"ఈ ముకుందరావూ మన వసంత యీడూ— జోడూగా ఉంటారు కదండీ ?"

"ఎందుకు ఉండరూ ? చిల్కా గోర్వంకల్లాగ ఉంటారుగానీ ...." — భర్త ఆర్ధోక్తిలో ఉండిపోడం జానకమ్మగారికి ఆందోళన కలిగించింది.

"కానీ .... ఎందుకండీ—మన భాసడికంటే రెండు క్లాసులు తక్కువేగా అతగాడు చదువుకుంటూ .... పైగా చేసే ఉద్యోగమేనా ? అంత ఘనమైనదీ అంటే అదీ కాదుగా .... మరీ అంత ఏనుగు దాహం ఉండకూడదు సుమండీ ".....

"మరి మన కుర్రవాడికి కావల్సినవన్నీ తను ధనమ్మచేత యిప్పిస్తాడ్నా. సురేఖను ఖాయపర్చుకొండీ అంటున్నాడే రాఘవేంద్రం ...."

"మరి వాడు వద్దంటున్నాడే .... అదీగాక దానికీ దీనికీ — బోడి తలకీ బట్టతలకీ అన్నట్లు ముడి ఎక్కడా ? అంట ?" ఆమె విసుక్కున్నది.

"పోనీ, ఓసని చేద్దునా ? చట్ట ప్రకారం కట్నం చెల్లదూ అని అఖరి క్షణంలో అభాసు చేద్దునా?" భార్య చెవిలో రహస్యంగా అన్నాడు సుబ్బారావుగారు — భార్య తల నిమిరాడు.

"బాబోయ్ ! మీ పెద్దలకు వెయ్యివేల దండాలు ...." ఆమె దూరంగా జరిగి చేతులెత్తి జోడించింది. "కావాలంటేనే జోలి పుచ్చుకు పోతాను గాని ఇలాంటి పనులవల్ల నా బిడ్డ కాపురం నాశనం ఐపోగలదు...." అన్నది.




"అయితే ధనమ్మగారికి మాట యిద్దామా ?"

ఆమె భర్తకు జవాబేమని యిస్తుంది. కణతలు నొక్కుకుంది బాధగా.

"ముకుందరావుకూ మన భాస్కరానికీ ఒకటే లాంఛనలు ఉండాలని కాబోలు ఈ రాఘవేంద్రం గారు ఎత్తు వేస్తున్నాడు"—

సుబ్బారావుగారి ఆలోచలనలో కొంత నమ్మకం కుదిరింది జానికమ్మగారికి.

"ఏమో భాసడ్ని మరోసారి అడుగుతానూ..." అని అంతలోనే "వాడా ? వాడు .... వాడూ" .... ఏమనాలో తెలియనట్లు.

"వాడు వాడే" నందామె బాధగా.

"కడుపున కనలేదుగా, వాణ్ని నేను ?—అందుకని యిలా కాల్చుకుని తింటున్నాడు నన్ను" ఆమె కంట తడి పెట్టుకుంది.

సుబ్బారావుగారు కాస్త చలించిపోయాడు.

"మధ్య నన్ను సాధిస్తా వెందుకే .... చివరికీ వాడూ, నువ్వూ ఒక్కటేసూ" అన్నా డాయన.

"ఏం చేయమంటారు ?" అని ఒక నాలుగు క్షణా లాగి ఆమె భర్త నడిగింది.

"ఎలాగా అమ్మాయి పెళ్లి ఐన ఏడాదికి కాని అబ్బాయి వివాహం చేయము .... అది మా సంప్రదాయం గనుక—భాస్కరం గురించి తరువాత ఆలోచిస్తామూ అని చెప్పనా ?" అడిగాడాయన.

"ఊఁ .... చెప్పండి" అన్న దామె యిక గత్యంతరం ఏమిటున్నట్లు ?

"కాని రాఘవేంద్రం అసాధ్యుడు సుమా ? పీళ్లు నములుతూనే తను ముకుందాన్ని ధనమ్మగారికి ధారపోసినట్లు — కేవలం తాను నిమిత్త మాత్రుడైనట్లూ మాట్లాడాడు ...."

సుబ్బారావుగారు చుట్ట భగ్ భగ్గున కాల్చాడు. ఇక ఫలాయనవాదంతో "ఆర్గ్యుమెంటు" ధోరణిలో పడిపోయా డాయన.

"అసలు విషయం ఇలా ఆలోచించాలయ్యా మనం .... ఒకటి మన భాస్కరానికి సురేఖ నచ్చిందా లేదా ? వసంతకు ముకుందరావు సరిపోయాడా ? లేదా ? ధనమ్మగారి ఉద్దేశం ముకుందరావుకు తనే గార్డియన్ అనా ? పోతే ఈ సురేఖను మనం చేసుకొనకపోతే ఆ ముకుందానికి మన పిల్లని యివ్వడం జరగదా ? ఇక సురేఖలోని లోపా లేమిటి? .... యివన్నీ ...."

"సరిసరి—ఆ అమ్మాయికి లోపాలేం లేవు. బంగారుబొమ్మలాగే ఉంది. ఎటొచ్చీ కాస్త చదువుకున్న అమ్మాయికదూ, బిరుసుగా ఉందంటే .... యిక ఆ పిల్లకి మా భాసడు నచ్చడమ్మా ? అది ప్రశ్న కానేకాదు. మా భాసడు భాసడే .... వాణ్ని చూడటానికి నాలుగు కళ్లు చాలవు .... అంటే దిష్టి కొడుతుంది" ఆమె మెటికలు విర్చుకుంది.

ఈవిధంగా మరో గంటసేపు ఆ దంపతుల సంభాషణ సాగిందే తప్ప ఫలితం శూన్యం.

'భాస్కరం యిష్టం' దగ్గరే నిర్ణయానికి గండి పడుతూ వచ్చింది.

గడియారం ఒంటిగంట అని ఆవలించింది. సుబ్బారావుగారు ఆవలింతలకు తావివ్వకుండానే గుర్రు పెట్టడం మొదలెట్టడంతో

"అన్నీ ఆడాళ్ల నెత్తిన రుద్దుతా రీయన గారు" అనుకుంటూ జానికమ్మగారు కూడా కనులు మూసుకుంది.

(ఇంకా వుంది)

# రాజధాని కబుర్లు

11—పేజీ తరువాయి

అన్నారు. ఇది మెచ్చుకోతగ్గదే! కాని రాజకీయాల్లో అరవైఏళ్ల తర్వాతే నాయకుల జీవితాలు ప్రారంభమవుతాయని ఓ అభిప్రాయం. దానికి అనుగుణంగానే, కేంద్రంలోగాని, రాష్ట్రాల్లోగాని, అరవై ఏళ్లు దాటిన మంత్రి పుంగవులు చాలామంది, తమ పదవులు శాశ్వతమని, శాశ్వతం కావాలని కలలు కంటున్నారు. ముఖ్యమంత్రిగారి అభిప్రాయం, వీరందరూ తప్పుకోవాలనేమో తెలీదు! సమర్థవంతమైన, న్యాయమైన పరిపాలన కావాలి. దానికోసమే ప్రయత్నం చేస్తున్నాను. ఇది అడుగునుంచి ప్రారంభం కాకూడదు. పై నుంచే ప్రారంభం కావాలి. పెద్ద అధికారులు, చిన్నవారలకు ఆదర్శంగా కనబడాలి అన్నారు.

ఇదిబాగానే ఉంది. మరి ఇలాంటిది ప్రారంభం అయిందా ఇప్పటి వరకు, ఏ రూపంలో, ఏవిధంగా అయిందో, ప్రజలు తెలుసుకోవచ్చా! అసలు ప్రారంభమే కాకపోతే, ఎప్పుడు చేస్తారు. దానికేమన్నా ముహూర్తం పెట్టారా! ఇలాంటి ప్రశ్నలు ఉదయించక మానవు! ప్రజాస్వామ్యంలో విమర్శలు కొల్లలు కొల్లలుగానే వస్తాయి. అందులో గొప్పతనమదే! అయితే ఆ విమర్శలను గురించి ఆలోచించటం, చేసినవారి స్థాయీ, నిజాయీతీల మీద ఆధారపడి ఉంటుందన్నారు. ఎవరు అంటున్నారు అనే విషయం కంటె, ఏమంటున్నారు అనే దానిమీదే ఆలోచన కేంద్రీకరించటం అవసర మనిపిస్తుంది. విమర్శల్లో సత్యాసత్యాలు తెలుసుకోవటానికి ప్రయత్నం చేస్తున్నామని, పొరపాట్లు చేసి కనక ఉంటే దిద్దుకోవటానికి ఎప్పుడూ సంసిద్ధుడ్నే అని కూడా అన్నారు. దీనిమీద ఆక్షేపణేమీలేదు! తన కొచ్చిన పదవి, నిజాం ఫర్మానావలన కాని, ఢిల్లీలో పెద్దల సానుభూతి వలన కాని వచ్చింది కాదని, కేవలం, మూడుకోట్ల, అరవై లక్షల ఆంధ్రులు కోరుకుంటేనే తాను ముఖ్యమంత్రి నయ్యానని, సగర్వంగా చెప్పుకున్నారు. వాస్తవం తెలుసుకుంటే, ఆంధ్ర ప్రజానీకం, గత ఎన్నికల్లో కాంగ్రెసు పార్టీవారిని గెలిపించి, వారిపట్ల విశ్వాసాన్ని ప్రకటించిందనటం నిర్వివాదాంశం. అత్యధిక సంఖ్యాబలం, శాసన సభలో తెచ్చుకున్న కాంగ్రెసు పార్టీవారు, ప్రభుత్వాన్ని, ఏర్పరచట మనేది చట్టరీత్యా సమర్థించ తగ్గది. ఇంతవరకే గాని, ఆంధ్రప్రజలు, ఫలానా వ్యక్తికి అధికారాన్ని హస్తగతం చెయ్యాలని శాసించలేదే.

ఏమయినప్పటికి సామాన్యప్రజలకు కావలసింది కోరుకునేవి,ముఖ్యావసరాలు, ఈప్రభుత్వంవారు వాటిని ఏమాత్రంఅందరిఅందుబాటులోఉంచుతున్నారు,అనేదే సమస్య. న్యాయపరిపాలన, తిండీ, బట్ట, నివాసంతో పాటు విద్యాసౌకర్యాలు, వైద్య సౌకర్యాలు కల్పించిననాడు ప్రజలకు, ఏ వ్యక్తి అయినా ఫరవాలేదు. ఏ పార్టీ అయినా చింతలేదు! ఈ సువర్ణోత్సవంలో వో మంచి పని జరిగింది. లక్ష రూపాయలు ముఖ్యమంత్రిగారి కివ్వటం, పేరు ఎల్లీ కమిటీవారికి యిస్తూ విద్యాసౌకర్యాలకు వినియో

# సరాగమాల

9 వ పేజీ తరువాయి

...పితం చేసుకోవాలనే అభిప్రాయంతో మీకు వ్రాయ లేకుండా ఉండలేకపోతున్నాను (అంత మాట లకు తగనని తెలిసినా, ధన్యుణ్ణి) సంగీత సాహిత్యాల సొత్తు కోసం అహరహం తపించే, వాటి విలువ లను అత్యున్నతంగా ఉంచుకొనే నా హృదయాన్ని అర్థంచేసుకోగలరని ఆశిస్తాను (తప్పక)

"సాహెబ్ బీబీ ఔర్ గులామ్" మీద మీరు వ్రాసిన అభిప్రాయం చాలా బాగుంది పాటలు నాకు చాలా నచ్చాయి మీ రన్నట్లు "భంవర్ బడా నాదాన్ హై" అన్న పాటలో ఆశ ఎంత శ్రవణానంద కరమైన పెంకితనాన్ని ధ్వనింపజేసింది ! అన్నట్లు మీకు చెబుదా మనుకున్నాను "సాహెబ్ బీబీ ఔర్ గులామ్" నవల వ్రాసిన బిమల్‌మిత్రా ఈ పూర్వం నే రైల్వేలో పనిచేసేవారు మా నాన్నగారికి మిత్రులు ఆయన దగ్గరకు ఈ అవకాశం పురస్కరించుకొని వెళ్ళాం ఎంత చక్కగా మాట్లాడేరు ! పెద్ద



నేపథ్యగాయకుడు పిఠాపురం నాగేశ్వరరావు

రచయిత నన్న అహంభావం ఏ కోశానా లేదు (నిజంగా గొప్పవారికి అహం ఉండదేమో) ఆయన రికమెండేషన్‌తో సత్యజిత్‌రాయ్‌ని కలుసుకున్నాం అడుగడుగునా ఆయన ముఖంలో విభిన్న భావాలు ద్యోతకమవుతూ ఉండేవి చాల సరదాగా మాట్లా డుతూ ఆయన అవార్డులు ఎలా అందుకున్నారో చెబుతూ ఒక్కసారి ఘల్లున నవ్వేసి 'ఏమిటి నా ముఖంలో భావాలు చూస్తావు? నేను చెప్పిన భావాలు అలాగే ఎక్స్‌ప్రెస్ చేస్తే పిక్చరు ఎందుకు విజయవంతం కాదు?' అని అడిగారు ఆయనింత చనువుగా మాట్లాడ్డం నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేసింది నిజంగా ఆయన ఒక మహా వ్యక్తి అన డంలో సందేహంలేదు

మీ రెప్పుడేనా వంగ గాయకి సంధ్యా ముఖర్జీ కంఠం విన్నారా? అచ్చు లతా కంఠంలాగే ఉంటుంది చక్కగా గమకాలు పలికి శ్రోతలను మైమరిపించే కంఠం (వినకేం, విన్నాను క్రితం 'వజా' లోనో "బజ్ దిల్" లోనో ఎస్డి బర్మన్ ఈమెతో పాటలు పాడించారు ఇవిగాక ఒక హిందీ ప్రైవేటు రికార్డు కూడా నా దగ్గర ఉంది)



మంచిరోజులు వస్తాయ్‌లో జగ్గయ్య, జమునా

'జయదేవ' లోని 'నాదు ప్రేమ భాగ్యరాశి', 'నీ మధు మురళీ గానలీల' మీ రెందుకు పరిచయం చేయలేదో తెలియదు ఎంత చక్కని పాటలు! ఆ పాటలు, అష్టపదులు వినటానికని ఆ చిత్రం అయిదుసార్లు చూశాను

'గుండమ్మ కథ' యిటీవలనే యిక్కడికి వచ్చింది పాటలన్నీ ఎప్పుడో విన్నట్లుగా ఉన్నాయి (కొంత పాతదనం పాటలో పలికితేనేగాని త్వరగా ప్రజలకు అందదన్న సంగతి పెద్దవారందరు గ్రహించారు అందు వారి చిత్రాలలో సర్వసాధారణమైన కల్యాణి, మోహన రాగాలు అంత విరివిగా వినపడతాయి) 'సన్నగా వీచే' అన్న పాట బాగా నచ్చింది అన్నిటికన్నా పింగళి సాహిత్యం బాగుంది, "ప్రేమయాత్రలకు" పాటలో (నాకు యివేమీ నచ్చలేదు మొదటిది 'అలి గిన వేళనే చూడాలి' రెండవది 'ఎంత హాయి ఈ రేయి')

"మద్రాసు (సంగీత?) వాతావరణం గురించి, ఈమధ్య జరిగిన రికార్డింగుల గురించి వ్రాయండి" ఈ లేఖ వ్రాసింది ఆంధ్రా నుంచి ఎమ్మెస్ ప్రకాశరావు.





తిరుపతమ్మ కథలో ఒక దృశ్యం.







# మిల్క్ ఆఫ్ మెగ్నీసియా అంటే ఏమిటి?

**అది మెగ్నీసియం హైడ్రాక్సైడ్ యొక్క ఎమల్షన్—పిత్తమును అరికట్టి, విరోచనకారిగా పనిచేసి, సకల విధములగు గ్యాస్ట్రిక్ పరిస్థితులను మాన్పుటకు విరివిగా వాడబడుచున్న పదార్థము.**

మిల్క్ ఆఫ్ మెగ్నీసియాకు మెగ్నీసియం హైడ్రాక్సైడ్ మిక్చరు బి. పి., మెగ్నీసియా మాగ్మా యూ. ఎస్. పి., క్రీం ఆఫ్ మెగ్నీసియా బి. పి., మొదలగు పేర్లు గూడా ఉపయోగిస్తారు. దానికి ఏ పేరు పెట్టినా, అసలు పదార్థము ఒక్కటే. ఎల్లరు అంగీకరించే ఫార్మకోపియాలో విధించిన కఠిన సూత్రాలను, ప్రమాణాలను అనుసరించియే ఇది తయారుచేయబడుతుంది. వ్యాపార సరళి కొరకు ఒక పేరు పెట్టి మిల్క్ ఆఫ్ మెగ్నీసియాను అమ్మినప్పటికీ, ఆ వస్తువు నాణ్యత ఎంతమాత్రము తగ్గుట గాని, హెచ్చుటగాని జరుగదు. దానిని తయారుచేయువారిని గుర్తించుటకు మాత్రమే ఆ పేరు పనికొస్తుంది.

కాని, వాడుకదారుని మనస్తత్వము ప్రకారము ఈ వ్యాపార నామమునకు ముఖ్యత ఏర్పడుతుంది. ఏమంటే, ఎల్లరు మంచిదిగా ఎరిగిన పేరు దానిని తయారుచేయువారి నిజాయితీని గూర్చి వాడుకదారునికి వలసిన హామీ నిస్తుంది. అందువలననే లెక్కకు మిక్కుటమగు వాడుకదార్లు ప్రతిరోజు MandH మిల్క్ ఆఫ్ మెగ్నీసియాను కొంటున్నారు. అది యునైటెడ్ స్టేట్స్ ఫార్మకోపియాలోని సూత్రాల ననుసరించి తయారుచేయబడి, ఉత్పత్తివిధానంలో ప్రతిమెట్టు వద్ద దాని నాణ్యత కొరతపడకుండ పరీక్షింపబడి, స్వచ్ఛతలోను, పనితనములోను సంపూర్ణ దోషరహితముగ నుండుటయేకాక, అన్నిటికన్న మిన్నగ, తదితర MandH ఫార్మస్యూటికల్ వస్తువులవలె ఔషధ క్షేత్రంలో ఏభై ఏండ్లకు పైగా గడించిన అనుభవము దీనినంటియుండుట తటస్థించినది.

మార్టిన్ అండ్ హారిస్ ప్రై॥లి॥
రిజిస్టర్డ్ ఆఫీసు : మర్కెంటైల్ బిల్డింగ్స్, లాల్ బజారు, కలకత్తా-1










# అవీ - ఇవీ - అన్నీ

## సెట్టుమీద "నర్తనశాల"

విరాటరాజు కొలువులో వలలుడుగా భీముడు ప్రవేశిస్తాడు శాకపాకాలు బాగా క్రొత్తగా ఉన్నాయి ఉత్తర కుమారుడు స్వయంగా చూడటానికి వస్తాడు లడ్డు, అరిసెలు, గారెలు ఇత్యాదులు పళ్లాలతో ఉన్నాయి వంటవాళ్ళు హడావుడిగా ఉన్నారు ఉత్తర కుమారునితో వాలతుల్యుడు (తోకవంటివాడు) కూడ వస్తాడు

"ఆ— ఎంతవరకూ వచ్చాయి శాకపాకాలు ?"

"చూడగానే నోరూరుతుంది దేవరా !"

"ఎవరు చేశారివి ?"

"నేను చేశాను యువరాజా"

"వాడుకాదు యువరాజా, పిండి రుబ్బింది నేను"

"కాదు యువరాజా పప్పు నానబోసింది నేను"

"కాదు యువరాజా పేరందరి మీద పర్యవేక్షణ చేసింది నేను"

తరువాత మూగ వంటివాడు సౌజ్ఞచేసి "వారెవరూ కాదు వారు" అని వలలుడ్ని చూపిస్తాడు వలలుడు నవ్వుతూ తల ఆడిస్తాడు

ఉత్తర కుమారుడు (ఒక అరిసె తీసి విరిచి తింటూ)

"వలలా ! నీచేతి పాకం అమృతంలా ఉంది"

"అంత అమృతంగా ఉందా దేవరా ?"

"మరేం అనుకున్నా"— అంటూ చేతిలో మిగిలిఉన్న అరిసె ముక్కను వాలతుల్యుడుకిస్తాడు

"చాలా బాగా ఉన్నాయి వలలా ?"

"అంతా తమ అభిమానం !"

"నా మాటేమిటి ? ఇవి రుచిచూస్తే మహారాజుగారు ఈ మాటే అంటారు ఏమాట ?— నా మాట ! ఏరేమంటారు ? తప్పంటారా ? కాదంటారా ?"

మూగవాడు ఉబ్బి తబ్బిబ్బై నవ్వుతాడు ఒక జోక్ కూడా విసరుతాడు వాడిని చూచి మిగతా వాళ్ళంతా నవ్వుతారు

ఈ సన్నివేశం రాజ్యం పిక్చర్సులోని "నర్తనశాల" చిత్రంలోనిది ఈ మధ్య భరణీ స్టూడియోలో షూట్ చేశారు

ఉత్తర కుమారుడుగా రేలంగి, వాలతుల్యుడుగా అల్లు రామలింగయ్య, వలలుడు (భీముడు) గా దండమూడి రాజగోపాల్, వంటవాళ్ళుగా బాలకృష్ణ, బొడ్డపాటి, వంగర, సీతారాం, రామకోటి (వంటవాళ్ళంతా గెస్టు ఆర్టిస్టులుగా) నటించారు

వీరుగాక యన్ టి రామారావు, యస్ వి రంగారావు, సావిత్రి, సంధ్య, యల్ విజయలక్ష్మి, ముక్కామల్ల కృష్ణమూర్తి, కాంతారావు, (గెస్టు), నెల్లూరు వస్తాద్ కాంతారావు, ధూళిపాళ, ప్రభాకరరెడ్డి, శోభన్‌బాబు, సత్యనారాయణ, మల్లాది సత్యనారాయణ, వేమూరు రామయ్య, పొదిలి కృష్ణమూర్తి, వై నారాయణస్వామి, వి యస్ రాజు, కె జి రాజు మొదలగువారు నటిస్తున్నారు

రచన సముద్రాల రాఘవాచార్య, ఛాయ ఎం ఎ రహిమాన్, సంగీతం సుసర్ల దక్షిణామూర్తి, కళ టి వి యస్ శర్మ, నృత్యం వెంపటి పెద్దసత్యం, కూర్పు వీరప్ప, స్టూడియో:



బందిపోటులో రమణారెడ్డి, రాజనాల.



తిరుపతమ్మకథలో రామారావు, గుమ్మడి.



"పునర్జన్మ'లో కృష్ణకుమారి.

## ఆయుధాల కొరకు
## ఆభరణాలను ఇవ్వండి









## న్యూఢిల్లీ లేఖ

ఈ గుణ్ణాన పడి దిక్కు తెలియకుండా పోతున్నది!

శ్రీ డే సాధించిన 'అద్భుతం' ఇంకొకటిఉంది. చైనీయులు భారత దేశముపై దండెత్తిన కొద్ది కాలానికే నకే ఈయనమంత్రిత్వాన్నేమాయం చేసే అవకాశము ఏర్పడింది. ఆయన వెంటనే గ్రామీణ రక్షణ దళం అనేదానిని సృష్టి చేశారు. భారత దేశంలో కటారులు. లాఠీలతో వెల్లువగా ఏర్పడుతున్న ఈ ప్రజా చైతన్యాన్ని చూచి చైనీయులు భయపడి వెనక్కి వెళ్ళిపోయారు! నేఫాలో కానీ, లడఖ్ లో కానీ ఈ గ్రామీణ రక్షణ దళము శాఖ ఒకటికూడా లేదు. అసలు శ్రీ డే ఆ ప్రాంతములవైపు కన్నెత్తి చూస్తేగా!

శ్రీ డే ఇలా గ్రామీణ రక్షణ దళాలు, గ్రామీణ లేబర్ బ్యాంకులు, పంచాయతీరాజ్ మొదలగు నిర్మాణంలలో మునిగి తేలటంవలన పాపం ఆయనకి వ్యవసాయ ఉత్పత్తిని పెంచేందుకు తీరికే దొరకటం లేదు. ఈయన ఏర్పాటు చేసిన గ్రామీణ సేవాదళ పలుకుబడి ఎంతగా ఉన్నదంటే వాళ్ళు ఇంత వరకు నీటి కాలువల త్రవ్వకంలో వ్యవసాయ దారులను ఒప్పించలేక పోయారు. మరి ఈ బహద్దూర్ (శ్రీ డే) వారు తప్పు అనేది చేయరు కనుక పంట కాలువలను త్రవ్వి దానికి అయ్యే ఖర్చు వ్యవసాయదారుల దగ్గర నుండి పిండమని రాష్ట్ర ప్రభుత్వాలను ఆదేశించారు. అంటే ఈ కాలవల్ని త్రవ్వకానికి అయ్యే ఖర్చు నెత్తిన వేసుకొనమని వ్యవసాయదారుని అడగటము మూలంగా రాష్ట్ర ప్రభుత్వాలు అప్రతిష్ఠపాలవ్వాలన్న వన్నమాట. శ్రీ చెష్టర్ బౌల్స్ రాయబారిగా వస్తున్నారు కనుక శ్రీ డే పరపతి ప్రతిష్ఠ రవ్వంత పెరగాలి మరి!

ప్రధానమంత్రికి శ్రీ డే అంటే ఎంతో గొప్ప భావము ఉన్నది. కనుక మనకి కూడ ఉండాలి మరి. నిరంతరము ఒకే వ్యక్తి దేశంలో అనేకవేల మంది ప్రజలను వాజమ్మలుగా చేయ కల్గిన ప్రధాన మంత్రి మహాద్భుతంవలన శ్రీ డే మంత్రాలకు చింతకాయలు రాలే కాలము పోలేదని ఋజువు చేశారు.

మళ్లీ ఎందుకో ప్రభుత్వోద్యోగులను గురించి జ్ఞాపకము వచ్చింది. పండిట్ నెహ్రూ-ఒక్క నెహ్రూ ఏమిటి, ప్రతి కేంద్రమంత్రి కూడా తన కార్యదర్శిగా ఒక ఐ. సి. ఎస్. ఉద్యోగిని ఉంచుకొన వలసిందే

విన్నాడు రివాల్వర్ నలువేపులా గురిపెట్టాడు అంతేకాదు ఇంకో రెండడుగులు ముందుకు నడిచాడు సైతాన్

ఏదో నీడ కదిలినట్టు అయింది రివాల్వర్ ఢన్ మని పేలింది తుఫాన్‌పోరు ఒక తృటికాలం సైతాన్ నాలుగడుగులు ముందుకు వేశాడు బ్యాటరీ లైటు వేశాడు నేలమీద పడి ఉన్నాడు ప్రసాద్ సైతాన్ కౌయ్యకాలుతో ప్రసాద్‌ను ఊపాడు శవంలాగ గోచరించింది

మళ్లీ చీకటి— అంతా చీకటి

ఏదో వికృత అట్టహాసాల నడుమ సైతాన్ విశ్రమిస్తాడు ఖిల్లా నిశ్శబ్దమయం

ప్రసాద్ లేచి కూర్చున్నాడు మూలుగు విన్నాడు ఉలిక్కి పడ్డాడు తన జేబులోంచి టార్చిలైటు తీసి తన చుట్టూ చూసుకున్నాడు కర్ర చివర ఇత్తడి పొన్ను దొరికింది జాగ్రత్తగా జేబులో వేసుకున్నాడు మూలుగు వినవచ్చేవేపు వెళ్లాడు

నెత్తురులో పొరాడుతూ, మృత్యువేదన అనుభవిస్తున్నాడు పానకాలు. వెలుతురులో ప్రసాద్ గమనించాడు. ఇద్దరూ గుర్తుపట్టారు.

"ప్రసాద్‌బాబూ పారిపో.... నేను చేసిన పాపానికి నేనే బలైపోతున్నా.... బాబూ ! ఆ రంగయ్యబాబే మీ నాన్నగారు. మీ కుటుంబానికి పట్టిన పీడ ఎవరోకాదు....."

"చెప్పు పానకాలు ఎవరు ?"

పానకాలు మరణిస్తాడు.

ప్రసాద్‌గా యన్. టి. రామారావు, రంగయ్యగా నాగయ్య, పానకాలుగా మిక్కిలినేని నటించారు. రవీంద్రాఆర్ట్సు ప్రొడక్షన్సువారి ప్రథమ చిత్రం "అగ్గాధికారి"లోనిది. టైటిల్‌కూడా ఈ మధ్య స్థిరపరచారు. వాహినీ స్టూడియో ఒక ఫ్లోర్‌లో వేసిన పాడుపడిన పెద్దభవనం (ఖిల్లా) సెట్టుమీద షూట్ చేశారు. ఈ చిత్రంలో యన్. టి. రామారావు, గుమ్మడి, రేలంగి, నాగయ్య, రమణారెడ్డి, కె. వి. యస్. శర్మ, మిక్కిలినేని, కృష్ణకుమారి, గిరిజ, సూర్యకాంతం మొదలగువారు నటిస్తున్నారు.

## "అమరశిల్పి జక్కన్న"

"తరమా— వరదా—కొనియాడ నీ లీల
తనవూ— మనసూ— తరియించె
ఈవేళ"

ఈ పాటను సముద్రాల రాఘవాచార్య వ్రాసేరు ఘంటసాల అండ్ పార్టీ పాడుతారు చిత్రంలో నాగేశ్వరరావు తదితరులుతో చిత్రీకరణ చేస్తారు ఈ చిత్రం ఈస్టమన్ కలర్ చిత్రం

ఈ చిత్రంలో నాగేశ్వరరావు, బి సరోజాదేవి, రేలంగి, నాగయ్య, హరనాథ్, ఉదయకుమార్, సూర్యకాంతం మొదలగువారు నటిస్తున్నారు

మాటలు సముద్రాల రాఘవాచార్య, పాటలు సముద్రాల (సీనియర్), కొసరాజు, దాశరథి, సి నారాయణరెడ్డి, సంగీతం యస్ రాజేశ్వరరావు, కూర్పు పి జి మోహన్ అండ్ దేవేంద్రనాథ్, ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ శ్రీనివాసన్, ఛాయ నిర్మాత— దర్శకత్వం బి యస్ రంగా.

## "కలవారి కోడలు"

"ఏమిటి ఈ వివరీతం ..
విధికెందుకు నాపై కోపం
తలచే దొకటి— జరిగే దొకటి
ఎవరికి ఎవరో ఏమో. . . . . "

శ్రీ కొసరాజు ఈ పాటను వ్రాశారు ఘంటసాల పాడేరు యన్ టి రామారావుతో చిత్రీకరణ చేస్తారు

ఈ పాటను అరుణాచల స్టూడియోలో రికార్డు చేశారు

"ఎందుకే . ఎందుకే . . .
పొంగి, పొంగి లేతవయసు
చెంగుమన్నందుకే .
కదిలే పిల్లగాలి కైవురేపు నందుకే
మల్లెపరిమళాలు మత్తుగొలుపునందుకే"

ఈ పాటను సి నారాయణరెడ్డి వ్రాయగా సుశీల, పి కె సరస్వతి అండ్ పార్టీచే అరుణాచలం స్టూడియోలో ఈ నెల 10,వ తేదీని రికార్డు చేసారు ఇది పిక్నిక్ సాంగ్ ఈ పాటను గిరిజ, గీతాంజలి (మణి)లతో ఔట్‌డోర్‌లో చిత్రీకరణ చేస్తారు జూలై నెలాఖరుకు 8 రీళ్ల చిత్రం పూర్తి అవుతుంది సెప్టెంబరుకు చిత్రం పూర్తిచేసి విడుదల చేయనున్నట్లు నిర్మాతలు తెలియజేశారు.

ఈ చిత్రంలో యన్ టి రామారావు, కృష్ణకుమారి, రమణారెడ్డి, చలం, పద్మనాభం, ప్రభాకరరెడ్డి, గిరిజ, గీతాంజలి, (మణి), సూర్యకాంతం, హేమలత మొదలగువారు నటిస్తున్నారు

## "కాశీమహాత్మ్యం"

వెంకటాద్రి పిక్చర్సు అనే క్రొత్త సంస్థ "కాశీ మహాత్మ్యం" అనే పౌరాణిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు గోల్డెన్ స్టూడియోలో జానకి, పి బి. శ్రీనివాస్ పాడగా ఒక పాట రికార్డు చేశారు

ఈ చిత్రంలో కాంతారావు, హరనాథ్, బాలయ్య, కృష్ణకుమారి, జి వరలక్ష్మి, లీలాదేవి, జయదేవి,



ఈ బొమ్మలోనివాటి గ్రేటాగార్బో అనీ మార్లిన్ డిట్రిచ్ అనీ అనుకుంటే పప్పులో కాలువేశారన్నమాటే— 'విగ్రహాలు' వే కుని ఆ తారల వేషంలో వున్న మరో యిద్దరమ్మాయిలు వీళ్లు విగ్రహాల్లా వాటి రకాలూ ప్రదర్శించినప్పుడు తీసిన ఫోటో యిది.

# అవీ - ఇవీ - అన్నీ

జమునలతో పాడేరు. యన్. టి. రామారావు, రేలంగి, కృష్ణకుమారిలతో చిత్రీకరణ చేస్తారు

"ఓహో అందమైన చిన్నదాన....
బంగారు వన్నెదాన ..
ఓహో నీలిరంగు చీరదాన ...
బలే వెరజాణ
నామీద కోపమా."

ఈ పాట కూడ కొసరాజు వ్రాసిందే మాధవ పెద్ది పాడేరు రేలంగి, గిరిజలతో మద్రాసులో అడయార్ బోటుక్లబ్ దగ్గర ఔట్‌డోర్ షూటింగ్ జరిపేరు

ఈ చిత్రంలో యన్ టి రామారావు, గుమ్మడి, రేలంగి, కృష్ణకుమారి, గిరిజ, సూర్యకాంతం, ఋష్యేంద్రమణి మొదలగువారు నటిస్తున్నారు,

మాటలు నార్ల చిరంజీవి, పాటలు ‧ ఆరుద్ర, సి. నారాయణరెడ్డి, కొసరాజు, సంగీతం . టి వి చలపతిరావు, ఛాయ సి నాగేశ్వరరావు, కళ : కృష్ణారావు, కూర్పు సంజీవి, స్టూడియో విజయా—వాహిని, నృత్యం చిన్నిసంపత్, దర్శకుడు : వి మధుసూధనరావు, నిర్మాత . తమ్మారెడ్డి కృష్ణమూర్తి

## "అమ్మా-నాన్న"

శోనా ఫిలింస్‌వారు తమ చిత్రం "అమ్మా—నాన్న"ను ఈ నెల 21 నుండి మెజస్టిక్ స్టూడియోలో షూటింగ్ ప్రారంభించనున్నట్లు ఆ సంస్థ

వాగయ్య, ఇద్దరి పిల్లలతో చిత్రీకరణ జరుగుతుంది

ఈ చిత్రంలో కాంతారావు, ధాజనాల, వాగయ్య, హరనాథ్, బాలకృష్ణ, చదలవాడ, సురభి బాలసరస్వతి, హేమలత, రాజశ్రీ, ఛాయాదేవి మొదలగువారు నటిస్తున్నారు

సంగీతం . టి వి రాజు, ఛాయ . మర్లియురాసీ, కళ రామరాజు, కూర్పు మార్తాండ్, స్టూడియో, మెజస్టిక్, కథ . మాటలు పాటలు స్క్రీన్‌ప్లే నిర్మాతః దర్శకుడు యడవల్లి లక్ష్మీనారాయణ

## తెలుగుచిత్రం "దీపావళి" హిందీలోకి డబ్బింగ్

అశ్వరాజ్ పిక్చర్సువారిచే నిర్మించబడిన తెలుగుచిత్రం హిందీలో శ్రీ కళ్యాణరావు అండ్ కంపెనీ (మద్రాసు)వారు "నరకాసుర"లేక "లక్ష్మీ పూజ"అనే పేరుతో డబ్ చేస్తున్నారు పై కంపెనీకి అధినేత శ్రీ సురటి దుర్గారావు ఈ డబ్బింగ్ చిత్రానికి నిర్మాతకూడ దుర్గారావే

ఈ చిత్రంలో యన్ టి రామారావు, యస్. వి రంగారావు, సావిత్రి, యస్ వరలక్ష్మి, గుమ్మడి, కాంతారావు మొదలగువారు నటించారు ఈ చిత్రంను ఆగస్టు 15వ, తేదీ నుండి డబ్బింగ్ ప్రారంభిస్తారు దీపావళికి ఉత్తమ హిందూదేశ మంతటా విడుదల

"శ్రీ శేఖర్ ఫిలింస్‌వారు మదరాసు అరుణాచల స్టూడియోలో "గొల్లభామ" అనే చిత్రం తీస్తున్నారనేది తెలిసినదే ఆంధ్రప్రదేశ్ యాదవమహాసభ మే 12 న సభ జరిపించి, యీ సంస్థ చిత్రం పేరు మార్చవలసిందిగా ఏకగ్రీవ తీర్మానం చేసియున్నారు మే 24 వ తేదీని రాష్ట్రపతికి మదరాసు గవర్నరుకు, ఫిలిం సెన్సారుబోర్డు డైరెక్టరు (బొంబాయి) కు—చిత్రం పేరు మార్చవలసినదనియు, ఒక కలము పేర చిత్రమునకుపెట్టి ఆ కులమువారి ఆత్మగౌరవమునకు న్యూనత కలిగించుట తగదనియు 1951 సం లో శ్రీ రవీ ఫిలింస్‌వారు "గొల్లపిల్ల" అనే చిత్రం తీస్తున్నప్పుడు ఈవిధముగానే యాదవ కులమువారు ఆందోళన చేయగా సెన్సారుబోర్డువారు, ప్రభుత్వంవారు ఆ చిత్రం పేరునకు అభ్యంతరం తెల్పగా "పెంకిపిల్ల" గా మార్చబడినదనియు తెలియజేయడమైనది"

"అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ఉన్నప్పుడు "లా" డిపార్టుమెంటువారు 1930 డిసెంబరు 13, ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖవారు 1962 జూన్ 23, ఉత్తర్వులద్వారా "గొల్ల" అనే పదమునకు బదులుగా "యాదవ" అని చేర్చవలసినదిగా ఉత్తర్వులు ఇచ్చియున్నారు "గొల్ల" అనే పదము "యాదవు" లకే చెందియున్న దనుట స్పష్టము. 1951 సెప్టెంబరులో అప్పటి ఫిల్ము సెన్సారు బోర్డు అధ్యక్షులైన "శ్రీ క్లిఫర్డ్ అగర్‌వాలా" గారు మద్రాసులో జరిపిన చిత్ర నిర్మాతల సభ



ఆ ప్రమిత్రులు చిత్రంలో ఒక దృశ్యం.



మూడనమ్మకాలులో ఒకదృశ్యం.

అధినేత యడవల్లి లక్ష్మీనారాయణ తెలియజేశారు

"అమ్మా— నాన్నా— రెండు కళ్ళుగా—
చిన్నారీ పాపల్లారా— విన్నారా మీరీ సత్యం'

ఇదే కథానువుగా చిత్రీకరణ చేస్తున్నారు' అదే పల్లవితో పాటను కూడ వ్రాయడం జరిగింది.

చేయాలని ప్రయత్నిస్తున్నట్లు తెలుస్తుంది

## శ్రీ శేఖర్ ఫిలింస్ "గొల్లభామ" పేరుకు అభ్యంతరం

ఆంధ్రప్రదేశ్ యాదవ మహాసభ ప్రధాన కార్యదర్శి శ్రీ యల్లావుల కోటేశ్వరరావు ఇలా వ్రాస్తున్నారు :

యందు, చిత్రనిర్మాతలు ఒక ప్రత్యేక మైన ట్టియు, అగౌరవపరచునట్టియు, అటువంటి వాటి విడుదలకు సెన్సారుబోర్డు అంగీకరించదనియు, అలాంటి చిత్రం ఒకటి మద్రాసులో తీయుచున్నట్లు ఒక అభ్యంతరం వచ్చినదనియు (అదే పైన పేర్కొనబడిన "గొల్లపిల్ల" అనే చిత్రము) నొక్కి వక్కాణించియున్నారు."

## మాస్కోకు చిత్రాలు

దక్షిణభారత ఫిలిం ఛాంబర్ నుండి 5 చిత్రాలను మాస్కోలో ప్రదర్శనకు రికమండ్ చేసినా వెళ్ళిన చిత్రాలు రెండు మాత్రమే "మహామంత్రి తిమ్మరుసు" "రాఖీ" ఒకటిన్నర గంటలకు ప్రదర్శనమిచ్చే నిడివికి తగ్గించి యీ రెండు చిత్రాలు పంపించారు ఫిలిం ఛాంబర్ సిఫార్సు చేసిన చిత్రాలు 1 మహామంత్రి తిమ్మరుసు, 2 రక్త సంబంధం, 3 సిరిసంపదలు, 4 కులగోత్రాలు 5 రాఖీ

## కన్నడ చిత్రంలో పిఠాపురం యువరాజా గానం

దేశరాజ ప్రొడక్షన్సువారు వారి ప్రథమ చిత్రాన్ని కన్నడంలో జానపద చిత్రాన్ని తీయ సంకల్పించుకొని ఈ మధ్య ఫిలింసెంటర్ స్టూడియోలో రికార్డింగ్‌తో ప్రారంభించారు

ఈ చిత్ర దర్శకుడు కె యస్ యల్ స్వామి (రవి) వ్రాసిన రెండు పాటలను, ఒక శ్లోకంను రికార్డు చేశారు ఈ రెండు పాటలను, శ్లోకంను కూడ పిఠాపురం యువరాజా మోహన్‌కుమార్ పాడేరు

ఈ చిత్రానికి సంగీత దర్శకుడు చాంద్ ఈయన ఇదివరకు చిత్తూరురాణి పద్మిని చిత్రానికి సంగీత దర్శకత్వం వహించిన చంద్రం, సూర్యం ద్వయంలో చంద్రం, పర్యవేక్షణ మోహన్ కుమార్ (పిఠాపురం యువరాజా)

ఈ చిత్రంలో తెలుగు నటీనటులు జానకి, సుజాత, సురభి బాలసరస్వతి, ధూళిపాళ, రామకృష్ణ మొదలగువారుంటారు

నిర్మాత దేశరాజ రామారావు

సి ధర్మారావు ★

## అనుబంధాలు చిత్రసమీక్ష



అనుబంధాలలో గుమ్మడి.



ఆదే చిత్రంలో కృష్ణకుమారి

భర్త (జగ్గయ్య) భార్యను (కృష్ణకుమారిని) కాదని వేశ్య (నాగరత్నం) వలలోపడి, భార్యను గర్భవతియై ఉండగా యిలు వెడల నడిపి, తాను ప్రియురాలితోను, ఆఫీసు డబ్బుతోనూ పరారీ అవుతాడు కృష్ణకుమారి బిడ్డను కని, రైలులో వదిలి, ఆత్మహత్యకై విఫల ప్రయత్నంచేసి, ఒక ధనిక దంపతుల సాయంతో విదేశాలకు వెళ్తుంది ఆమె బిడ్డను గుమ్మడి (కథా నాయిక తండ్రి) దైవికంగా చూసి పెంచి, ఐదేళ్ల బేబీ(పద్మిని)గా చేసేవేళకు కృష్ణకుమారి తన నాదరించిన దంపతుల ఆస్తికి వారసురాలై మారు పేరుతో దేశం వస్తుంది తండ్రినీ, కుమార్తెనూ చేర దీస్తుంది గాని, భర్తను జాలిపడి జైలునుంచి విడిపించి కాపురానికి వెళ్లనని విరాకరిస్తుంది అతను కోర్టు కెక్కుతాడు కోర్టు బిడ్డను భర్తకే యిస్తూ, తీర్పు చెప్పినా, తల్లీ బిడ్డల అనుబంధం, భార్యా భర్తలను కలుపుతుంది

ఈ వస్తువు యితివృత్తం గల వాసవీవారి అనుబంధాలు చిత్రం విజయా గార్డెన్సులో పోయిన గురువారం (18 తేదీ) ప్రదర్శించినప్పుడు ప్రేక్షకులలో చాలామందికి నిండైన ఛాయాగ్రహణం, "నాపేరు సెలయేరు, నన్నెవ్వ రాపలేరు" (సి. నారాయణరెడ్డి) అన్న పాట అది పాడుతూ పరిగెత్తిన నాగరత్నం నాట్యం ఇంచుమించు చిత్రమంతటా (కొన్నిచోట్ల అతిగా) గల పద్మనాభం, స్వర్ణల హాస్యం నచ్చాయి బేబీ పద్మిని ట్రూపు పిల్లల నాటకం కూడా బాగుందనుకున్నారు కథలోని మలుపులంత బలమైనవి కాకున్నా అనుభవజ్ఞుడైన, శ్రీరామకృష్ణ దర్శకత్వం, నటీ నటుల కృషి చిత్రానికి బలం తెచ్చాయి

చివరకు మిగిలేది భార్యా భర్తల సినిమా రచనలో ప్రేక్షకులకు పరిచయమైన శ్రీ పిచ్చేశ్వరరావు సంభాషణలు ఈసారి తెలుగు నుడికారాన్ని మరింతగా సంతరించుకుని సరళంగా, సాఫీగా నడిచి పోయాయి కోర్టు సీనులను క్లైమాక్స్‌కు వాడుకున్నప్పుడు ఇంతకన్నా బలంగా, విపులంగా వాడుకునివుంటే బాగుండేదని తోచింది పాటలు రెండు మూడు ప్రజల నాకర్షిస్తాయి (శ్రీనివాస్)— కొత్త మొహాలైన నాగరత్నం, స్వర్ణల విషయంలో నాగరత్నం నటేమాత్రకన్నా, నాట్యంగా పరిగెడుతూ అగుపించడంవల్ల ఎటూ చెప్పలేంగాని, స్వర్ణ నటించగలదని చెప్పవచ్చును కృష్ణకుమారి, జగ్గయ్య, గుమ్మడి, రమణారెడ్డి, సూర్యకాంతం ఇంకా తతిమ్మా నటీ నటులంతా తమ శక్తి వంచన లేకుండా చిత్రానికి హంగులు తీర్చిదిద్దారు మొత్తానికి 'అనుబంధాలు' చిత్రం కూడా వినోదాత్మకమైన చిత్రమే !

—'క్రిటిక్' ★



తిరుపతమ్మ కథలో హాస్యజంట రమణారెడ్డి, బాలసరస్వతి



హాస్యతా లాస్యం వచ్చిన నటి మీనాకుమారి. (ఫొటో. ప్రభాకర్)

# 'మరువలేని మనిషి'

## రచన : కుమారి నాజ్

బాల్యం అంటే కొంతమందికి అదో రకమైన విచారకరమైందిగా ఉంటుంది. నాకు మాత్రం కాదండోయ్! నేను ఉన్నంతలో చాలా హాయిగానే ఉన్నాను నా కదేదో ఒక మంచి కలలాగా కన్పిస్తుంది ఆ కలంటే నా కెంతో ఇష్టం

నా కారేళ్ల వయస్సుంటుందనుకుంటా అప్పుడు సెంట్ తెరిసాస్ కాన్వెంటులో చదువుకుంటుండే దాన్ని ఆ రోజుల్లో నేను కూడా అందరు చిన్న పిల్లల్లాగే, ఏం కనపడ్డా విడ్డూరంగానే చూచే దాన్ని బడికి పోయేటప్పుడు రోడ్డుమీద జరిగే ఎంత చిన్న విషయమైనా నా మనస్సులో బాగా నాటుకుపోయేది ఆ విషయం చాలా కాలం గుర్తుండేది

ఓ రోజున బడినుంచి ఇంటికి తిరిగి వస్తున్నాను ఓ వింతమనిషి కన్పించాడు అతడు చేతులమీద పడుకున్నా కాలివేళ్ల మధ్య కలం పట్టి వ్రాస్తున్నాడు జనమంతా ముఖ్యంగా నా యీడు పిల్లలంతా అతని చుట్టూ చేరి విడ్డూరంగా చూస్తున్నారు అతనా పని చేస్తుంటే మాకు అదేదో మహాద్భుతం చేస్తున్నట్లనిపించింది

కాలితో రాయటం గొప్పా, అదేమన్నా పెద్ద వింతా అని అడగొచ్చు నే చెప్పేది విని వింతో కాదో మీరే ఆలోచించుకోండి

ఆకారమైతే మనిషి లాగా ఉంది కాని, అలవాట్లు మాత్రం మనవి కావు అందుకే అతన్ని చూసి జనం ప్రపంచంలో ఏవిచిదో వింతగా చూస్తుండే వారు ఆతర్వాత ఎవరో నాకు చెప్పారు ఆ పిల్లాణ్ణి ఇంతప్పుడే తోడేలు ఎత్తుకుపోయిందిట అతగాణ్ణి వెతకటం తలిదండ్రులతోపాటు పోలీసులకు కూడా సాధ్యం కాకపోవటంతో అందరూ అతన్ని వెదికే పని మానేసారు

చాలారోజుల తర్వాత కొంతమంది వేటకని మధ్య ప్రదేశ్‌లోని అడవులను ఓ మహారాజావారి వెంట వెళ్ళార్ట వీళ్ళంతా ఓ రోజుపాటు గాలించిన మీదట వేటకు ఓ తోడేలు దొరికిందట వెంటనే మహారాజా వారు ఆ తోడేలును తుపాకితో కాల్చారు దానికి బలమైన గాయమైతే తగిలింది కాని, తప్పించుకుని పారిపోయిందిట దాన్ని ఎలాగైనా చంపి తీసుకురావాలని మహారాజా వారు నౌకర్లను పంపితే వాళ్ళు దాని గుహదగ్గరకు పోయి మొత్తం మీద చంపివేశార్టట అప్పుడే, ఆ సేవకులకు ఈ తోడేలు పిల్లవాడు కన్పించటం ఈ విషయం తెలిసి మహారాజావారు అతన్ని తనవెంటట తీసుకు పోవటం జరిగిందట

మహారాజుకు ఆ 'అబ్బాయి' మీద జాలికలిగి దేశంలో పెద్దపెద్ద డాక్టర్లందర్నీ, ఇంకా జంతు మన శ్శాస్త్ర వేత్తల ఈ మాట నాది కాదు, ఎవరో చెప్పారు నీ పిలిపించి వాళ్ళ పరిశీలన క్రింద బలరాంపూర్ ఆస్పత్రిలో ఉంచారట తోడేలు మాదిరి అరవటం, అచ్చమానవుడిగానే నవ్వ (ఛీ! పాడు) మాంసం తినటం. అన్నీ ఆ తోడేలు గుణాలే ఇలాంటి పిల్లాణ్ణి సుమారు 4 ఏళ్ళపాటు డాక్టర్ల పరిశీలనలో ఉంచగా క్రమక్రమంగా ఆ పిల్లాడికి మనిషి గుణాలు అలవాటయ్యేట్లు చేశారుట

అతిఓపిక, మహారాజు ఖర్చుపెట్టిన ధనం ఆ 'అబ్బాయి' బాగుపడేందుకు కారణమై చిన్నగా మాట్లాడటం నేర్చుకున్నాడుట తర్వాత మహారాజ వారిని దగ్గరి వాళ్ళలో జమైపోయాడుట ఇదీ కథ

ఇదంతా ఎవరో చెప్పారు. వింటుంటే నాకు ఆ అబ్బాయి కన్న, అతనికథ మరింత వింత అని పించింది అతడు ఎలా బాసింది, పలికింది నడిచింది నాకు ఇప్పటికీ జ్ఞాపకం ఉంది

ఇంతలో ఎవరో నన్ను ఆ అబ్బాయిని ముట్టుకోమన్నారు బాబోయ్ నాకు ఎప్పేంత భయం పుట్టింది అతగాడి వళ్ళంతా గొడ్డుతోలు మాదిరే ఉంది

నే నతన్ని ఎందుకు మర్చిపోవంటే వాలో ఈ రోజు ఆలోచన, అయ్యోపాపం అనే సానుభూతి కల్పించిన వ్యక్తి అతడు. జంతువు తనం నుంచి మనిషిగా మార్చటానికి ఎంత శ్రమ, బాధ పడ్డాలో మనకేం తెల్సు అతడు ఎన్నో చిక్కులు ఎదుర్కోవలసి ఉంది అతడు నవ్వుతూ వాటిని ఎదుర్కొంటున్నాడు మనకాలికి కాస్త దెబ్బతగిలితే చాలు, అయ్యో, అమ్మో అని గోలపెడ్తాం అందుకే "ఆ తోడేలు పిల్లడు" నేను మరువలేని మనిషయ్యాడు ★

* * *

గత సంచికలో అడ్వయిజరీ పేనల్ ఆఫ్ సెంట్రల్‌బోర్డ్ ఆఫ్ ఫిలిమ్ సెన్సార్ (మద్రాసు ప్రాంతం)లో సభ్యులు ముగ్గురి పేర్లను వేశాము. అయితే పై మాటకు బదులుగా సెంట్రల్‌బోర్డ్ ఆఫ్ సెన్సార్ అని పడ్డది పై విధంగా సవరించి చదువుకోనవలెను



'పాఠకులకు నా శుభాకాంక్షలు' (రచయిత్రి)

చిత్రసమీక్ష

## కొడుకులు - కోడళ్ళు

గుణగణాలనేవి పుట్టుకనుబట్టి, సంపదలనుబట్టి కాదు బాహ్యమైన ఆడంబరాలకన్న ఆత్మశుద్ధి ముఖ్యం దానికి మించిన సంస్కారం లేదు ఇవి లేనప్పుడు చదువున్నా, సంపదలున్నా జీవితంలో సుఖానుభవం పొందలేరు ఎంతో సంస్కారమున్న పెద్దలని పెంచుకునేవారు కూడా ఆత్మశుద్ధి లేనప్పుడు ఏవో పొరపాట్లుచేసి ఫలితాలను జీవితాంతంవరకు అనుభవిస్తారు ఇలాంటి నీతిని ఓ కలవారి ఇంటి కోడళ్లిద్దరి జీవితాల కన్వయింపజేస్తూ మధు ఎక్సర్స్ తయారుచేసిన చిత్రం కొడుకులు—కోడళ్ళు'

"కొడుకులు కోడళ్లు"లో శివాజీ.

ఒకానొక జమీందారుగారి అన్న పిల్లడు రాజా తన పిల్లడు గోపాల్ జంటగా పెరుగుతుంటారు. రాజాకు చదువుమీద, గోపాల్‌కు వేటమీద ఆసక్తి.

జమీందారుగారు పిల్లలకు పెళ్లిచేయా లనుకోవటంవల్ల అన్నదమ్ము లిద్దరు విచిత్రంగా ఓ ఒప్పందానికి వచ్చి రాజా చేసుకోదల్చుకున్న మీనా (రాజసులోచన)ను గోపాల్, గోపాల్ చేసుకోదల్చుకున్న సీతను రాజా చూసి వస్తారు. కానీ, రాజా సీతను ప్రేమించి కల్లిబొల్లి ఉత్తరాలు వ్రాయటంతో గోపాల్ మీనాలకు, రాజా సీతలకు వివాహం జరుగుతుంది. గోపాల్ విద్యావిహీనుడని తెలుసుకున్న మీనా అతన్ని ద్వేషిస్తుంది. రాజా, సీతలు వేరే కాపురం పోయి హాయిగా ఉంటారు. మీనాను రావుబహద్దూర్ రంగయ్య (రంగారావు) కాపురానికి పంపక, రాజా తమకు వ్రాసిన ఆకాశ రామన్న ఉత్తరాన్ని జమీందారు దగ్గరకు పంపి గోపాల్‌పై నేరారోపణ చేస్తారు జమీందారు కూడా నమ్మి గోపాల్‌నే నిందిస్తారు నిజం తెలిసినా గోపాల్ తల్లి ఏమీ చేయలేక వూరుకుంటుంది

తండ్రి బలవంతంమీద అత్తింటికి వచ్చిన మీనా చేసిన అవహేళన భరించలేని గోపాల్ ఆమెను కొరడాతో కొట్టటం జరుగుతుంది మీనా పుట్టింటికి వెళ్లిపోతుంది

తల్లిమీది కన్న ఎక్కువ గౌరవం వదినమీద పెంచుకున్న గోపాల్ సీత మాటకోసం మీనా యింటికి వెళ్లి ప్రాధేయపడి దెబ్బలుతిని వస్తూ తోటలో పిచ్చెత్తినట్లు వ్యవహరించటం, వార్త తెలిసి వచ్చిన రాజాతో వాగ్వాదం చెలరేగటం, పతిని రక్షించుకోవచ్చిన సీత గోపాల్ చేతిలోని తుపాకి లాక్కునే ప్రయత్నంలో ఉండగా గోపాల్ చేతిలోని తుపాకి పేలి రాజా మరణించటం జరుగుతాయి,

గోపాల్‌కు రాజామీద ఉన్న అభిమానాన్ని అర్థం చేసుకున్న సీత సాక్ష్యంవల్ల గోపాల్ నిర్దోషని ఋజువవుతుంది. మీనా పశ్చాత్తాపం చెంది గోపాల్‌ను క్షమార్పణ వేడుకుంటుంది

గోపాల్‌గా శివాజీ గణేశన్ రాజాగా బాలాజీ ఉత్తరభాగంలో బాగా నటించారు.

తర్జుమా విధానం కొంత అసంతృప్తిగానే ఉన్నా 'పూవంటి కన్నె,' 'తెలియదే' అనే రెండు పాటల విషయంలో చక్కగా కుదిరింది. పామర్తి సంగీతంతోపాటు శ్రీ శ్రీ పాటల రచన కూడా చక్కగా ఉంది.

చిత్రంలో చాలా లోపాలున్నా ముఖ్యంగా చెప్పుకో దగ్గది ఇతివృత్తానికి పేరుకు పొంతన లేకపోవటం. ఇలాంటి విషయాల్లో నిర్మాతలు తగినంత శ్రద్ధ వహిస్తే మంచిది. నాగరాజ్.

## నక్షత్రకుని ససుగుడు

వేసవి రాగానే విదేశాలకు వెళ్లని కేంద్ర మంత్రులు చాలా తక్కువ. ఏదో ఒక మిషమీద గాంధీవాదులు పరదేశాలకు వెళ్లి సేద తీర్చుకుంటూ ఉంటారు. కాని విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షుల విషయంలో మాత్రం విదేశయానం కష్టం అయిపోయింది! బహుశ, మిగిలిపోయిన 'పి—ఫారం'లు (విదేశయాత్రకి ఇవి అవసరం) చాలావరకూ మాస్కోకి వెళ్లిన మహిళలకే సరిపోయాయేమో! వీరందరూ భారతదేశంగోడు కృశ్చేవ్‌తో చెప్పుకుని చైనాతో యుద్ధంలో మనకి విజయం చేకూరుస్తారేమో, ఎవరికి తెలుసు?

* * *

'సత్యహరిశ్చంద్రుణ్ణి' అమ్ముకున్నా తప్పు లేదు. అందువల్ల తెలుగు సినిమాకు మంచి కథేనా దొరికింది కాని అమధ్య గాంధీజీ మీద మార్క్ రాబ్ [ర్] సన్ 'నైన్ అవర్స్ టు రామా' అనే సెక్స్ క్రైమ్ సినిమా తియ్యడం— దాన్నిచూసే దౌర్భాగ్యం ఒక మంత్రివర్యులకే దక్కడం—గాంధీజీని కించ పరిచారనీ, గాడ్సేని ఆకాశాని కెత్తేశారని వాళ్లి క్కర్చుకోడం జరిగింది మళ్లీ ప్రభుత్వం మరో రిచెర్డ్ అటెన్ బరో అనే బ్రిటీషు నిర్మాతకి గాంధీగారిని తెరకెక్కించే అవకాశం యిస్తోంది— ఇది గాంధీజీ మీద భక్తితో చేస్తున్న పనేనా? అని? ఆ సినిమాల వాళ్లకి గాంధీజీని వినియోగించుకుని అమ్ముకోటంకన్నా గొప్ప వుద్దేశం వుండకపోతే తప్పు లేదుగాని — ముందూ — వెనుక చూడకుండా గాంధీజీని తెరమీద కెక్కించడానికి రెండోసారి ప్రభుత్వం ఒప్పుకోడం భావ్యమాని? పైగా బ్రిటిష్ నిర్మాతకా ఆ పర్మిషన్? హా!! హంబ్రుంబ్రా!! ★

అమరశిల్పి జక్కన్నలో
ఒక దృశ్యం.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 &7 Thambuchetty Street, Madras-1. Chief Editor S. Sambhu Prasad.

# ప్రతి కుటుంబము కొనగలిగే ఒక ఉత్తమమైన టాల్కం పౌడరు!




## పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్

### చల్లనైనది • సువాసనగలది • నవోత్సాహము కలిగించేది

పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ కుటుంబములోని వారందరూ అన్ని కాలములలోను వాడదగిన ఉత్తమమైన టాల్కమ్ పౌడరు. ఎండలు మండుతున్నప్పుడు మృదువైన, ఉపశమనము కలిగించే పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ రోజంతా మిమ్మల్ని సౌఖ్యముగా ఉంచుతుంది. ఉక్కగా ఉన్న వాతావరణములో చెమటను పీల్చే మరియు తేలికైన సువాసనగల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ రోజంతా మిమ్మల్ని సువాసన వెదజల్లుతూ, హాయిగా ఉండేలా ఉంచుతుంది!
నేడే ఒక పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ డబ్బాను కొనండి — ఇప్పుడు ఇది 3 సైజులలో లభిస్తోంది!

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపితము)

JWT-P. 1296

